ప్రదక్షిణంబుఁ గావింతునని విద్వజ్జనసమక్షంబున సంకల్పంబుఁ గావించి, చెన్న కేశవస్వామిదివ్యశ్రీపాదపద్మంబులు నిండుడెందంబనునరవిందమధ్యంబునం బొందు పఱిచి, మందమందగమనమున శ్రీహరిసహస్రనామంబులు చర్చించుచుఁ బెద్దలగు బ్రాహ్మణులు వెంట రాఁ దన్మధ్యంబునఁ దనుక్లేశంబునకోర్చి ప్రదక్షిణం బొనరించు నెడఁ బ్రదక్షిణప్రదక్షిణంబునకు గరుడస్తంభోపకంఠభూమి నుదురంట సాష్టాంగదండప్రణామం బొనర్చుచు దక్షిణంబుదుగక ప్రదక్షిణనమస్కారంబు సేయుచు, సాయంకాలసమయంబునం బ్రదక్షిణం బొనర్చి గరుడస్తంభంబు చెంత నిలిచి బ్రాహ్మణజనంబు లిరువంకలఁ దొలంగ సాష్టాంగదండనమస్కారం బొనర్చుచు నచ్చో శంఖచక్రముద్రితస్థాపితోపసంఘర్షణోపలక్షితశంఖచక్రలాంఛిత భుజయుగళుండైన నిరీక్షించి విద్వజ్జనంబులు పౌరులు బంధువులు మంత్రిసామంతపరివారనికరంబును విస్మయంబంది యితనిచరితంబు దివ్యంబని పలుదెఱంగులం గొనియాడిరంత నావీరహొంమ్మాళిరాయమహామండలాఖండలుండు నిజపురంబునకరుగుదెంచి వీరనారాయణదేవ చరణాంభోరుహారాధనానుసంప్రాపిత సకలసామ్రాజ్యవిశేషభోగంబులుం బరమభాగవతజనసఖిత్వంబునుం గల్గి పెద్దకాలంబు ధాత్రిఁ బాలించుచుండె. 171

తే. ఆమహారాజునకు సుతుఁడైనతాత, పిన్నమమహీశ్వరేశుఁడు పృథివి నేలె
రంతిహైహయనలసగరనృగపురూరు, భరతశశిబిందుకుమహీవరులఁ బోలి. 172

క. ఆతాతపిన్ననృపవరుఁ, డాతతభుజవిక్రమమున నహితోర్వీశ
వ్రాతముల గెలిచి ధర వి, ఖ్యాతిగఁ దక్షిణమొసంగి క్రతువులఁ జేసెన్. 173

## బిరుదగద్యము.

స్వస్తి, సమస్తసద్గుణాభిరామ, రాజరాజాన్వయాబ్ధిసోమ, నిస్తులోదార్యవిరాకృతసూర్యనందన, వైరిభూపాలాభిస్పందన, సమస్తసురాచారఫలుపరాచనాయకరాజసప్తాంగహరణ, నతదిగంతరాగతనానాదేశికరమకుటమణిఘృణివిరాజితచరణ, శరణాగతవరద, మన్యపులిబిరుద, మహామణ్డలాధిగతకటకశాసన, సైన్యపాకశాసన, వీరహొంమ్మాళిరాయతనూజ, తాతపిన్నరాజ, జయ, విజయీభవ. 174

వ. అనియారాజేంద్రుండు వందిజనవందితుండగు. 175

ఆ. తాతపిన్ననృపసుధాధామవరకీర్తి, చన్ద్రికాభిరామసరణియమరుఁ
గాశిసేతుమధ్యకటకవనీవక, జనచకోరములకు సమ్మదముగ. 176

ఆ. తాతపిన్నరాట్ప్రతాపంబు మిక్కిలి నిండి పర్వఁగమలజాండమునర

విజయజలజనయన వేడ్క చేఁ గైకొన్న, కుంకుమంపుబరణికొమరునమరి. 177

చ. అతనికి సోమదేవవసుధాధిపుఁడుద్భవమంది నిర్జితా
హితుఁడయి తాల్చె భూభరమహీనపరాక్రమరేఖ నెన్నఁగా
క్షితిధరజామనోహరునికిం బ్రతియాచును నీతిచే బృహ
స్పతిసరిఁబోలి ధర్మమునఁ బాండుసుతాగ్రజుఁడు కోడరై. 178

క. సకలజనంబులు సిరులం, దొకటనునచ్చికములేకనుండఁబెనుచుచుం
బ్రకటముగ ధనము విప్రత,తికినిడి సవనములు సోమదేవుఁడొనర్చెన్. 179

సీ. బలవంతుఁడగునడబాలనాయకునిని పూరుఁడౌగుజ్జులవీరినేని
రౌద్రరసోన్నిద్రు రుద్రపాధిపు మహాశౌర్యు గౌరారెడ్డి సాహసాంకు
గంగినాయకుని సంగ్రామరంగంబున సింగంబు మత్తమతంగజములఁ
బట్టుకైవడిఁబట్టి చట్టలెత్తించి కిన్కనునసహుండునై గంగినేని
తే. కొండప్రాగ్ద్వారసీమనుద్దండమప్పు ట్టిఁ, గంబములఁ బాఁతి తోరణగాఁగఁగట్టి
వినుతికెక్కెను సకలభూజనులచేత, సోమదేవనృపాలసుత్రాముఁ డెలమి. 180

సీ. కదనరంగంబునఁ గరితురంగమవీరవితతితోఁ బలుమాఱు విఱుగఁదోలి
యమితోగ్రశౌర్య మహాత్ముఁ బట్టి నీపేరుఁబెట్టెదనుగుమారునకది
గాక భవత్పాదకమలంబు నుదురంట దండంబుఁబెట్టెదఁదన్నఁగాచి
విడువుమన్ననుగాచి విడిచియర్థులకును షష్టిశతంబునశ్వములవాని
తే. చేతనిప్పించి శరణన్నఁ బ్రీతిఁగాచు, బిరుదు తగునీతనికెయని ధరణిపతులు
సన్నుతింపఁగనాదిరాజన్యచర్యఁ, దేజరిలె సోమదేవధాత్రీశ్వరుండు. 181

సీ. దండెత్తి చని మహోద్దండతప్రవృత్తిని గంగినేనికొండనలీలగానుగట్టి
కందనవోలునుగలువకోలునుగోటరాచూరునెటువంటిరాజుకైన
సాధింపరానిమొసలిమడుగు మఱియూతగిరినగరము సాతానికోట
వరుసతో సాధించి విరమునాఙ్గంబునఁదత్తన్నృపజనతతులఁ బ్రోచి
తే. ధరకుఁదొడవని వినుతింపఁదగినయట్టి, యారవీటిపురాధ్యక్షుఁడగుచుఁ దాత
పిన్ననృపసోమదేవుండెయెన్నదగిరెయు, నఖలసత్కవిసురభూజమనుచు నెపుడు. 182

## బి రు ద గ ద్య ము.

జయజయ, నిఖిలమహాభోగనిలముఖ్యవిఖ్యాతకీర్తి, ఏకదివసఘటికైకఘాటీహాతా
హృతకోటరాచూరు సాతానికోట కందనవోలు యాతగిరి కలువకొల్లు మొసలి
మడుగు గంగినేనికొండాభిధానసప్తదుర్గప్రవర్తి స్థలదుర్గ జలదుర్గ గిరిదుర్గ వనదుర్గ

చారాశిదుర్గ విఘాళ, సముద్ఘుష్యమాణబిరుదాపదాన హాళిహాళికాకర్ణనపులకితక పోల, నాకులపాటిముదుగంట్యానెగొందికుంతిసనవిజయలక్ష్మీసమక్షీకరణలక్షిత, నాకులపాటివీరక్షేత్రభారతీమల్ల ముదుగంటివీరక్షేత్రభారతీమల్ల ఆనెగొందివీర క్షేత్రభారతీమల్ల కుంతివీరక్షేత్రభారతీమల్ల వీరక్షేత్రభారతీమల్ల బిరుదభరితాను భావ, స్వభావగంభీరాంభోనిధి, సత్వగుణవాసుదేవ, సకలనరదేవచూడామణి, అసి భరణపటిమసహదేవ, ఆదిదేవ, సుపర్వరమణీమణిస్తుత, వరద, భయద, హాసబిరు దరగండ, వీరప్రతాపబిరుద, బిరుదుమన్నెరగండ, పురిగోలసురత్రాణ, శరణాగత త్రాణబిరుద, రాయరణరంగభీభత్స, రాయరాహుత్తరగండ, రాయవరగండ, గండర గండ, తాతపిన్నమరాజతనూజ, సోమదేవరాజ, విజయీభవ, దిగ్విజయీభవ. 183

వ. అని బిరుదులఁబొగడ మహీతలంబుఁ బాలించె. 184

మ. హరిశౌర్యుండగుసోమదేవవసుధాధ్యక్షునుసత్కీర్తి భా
సురతన్వ ద్దెసలెల్లనిండి తగఁబొల్చున్ భూజనస్తుత్యమై
హరమందారపటీరహీరకలశౌతాబ్జాహిరాట్పారదా
శరదభ్రాంబుజగర్భసూనులవలక్షుస్ఫూర్తి వారింపుచున్. 185

ఉ. ఇమ్మహి సోమదేవమనుజేంద్రుప్రతాపము నిండి దిక్కులన్
బమ్మినఁజాతపోతనవపల్లవబింబఫలారుణాంబుజా
తమ్ములటంచుఁగోకిలకదంబము కీరచయంబు చంచరీ
కమ్ములుగ్రమ్ముచుండునొడికంబుగ భ్రాంతివహించి పల్మరున్. 186

తే. సోమకులదీపకుండగుసోమదేవ, రాజవరునకునుదయించి రాఘవేంద్రుఁ
డఖిలనృపతులు ముకుళితహస్తులగుచుఁ, గొలువఁ ధరయేలెనతఁడు సౌర్గ్బలము మెఱసి.

సీ. ఎదిరించువైరులమదమడంపను శరణనినను రక్షింపనతఁడె నేర్చు
భావింప జనులకు భయముఁబుట్టింపనాహ్లాదమునొనరింపనతఁడె నేర్చుఁ
బరముధర్మమ్ముదప్పక నడవను జనతతిచేత నడపింపనతఁడె నేర్చుఁ
గమనీయనీతిమార్గము తెలివిగఁ దెలియను బోనుదప్పనునతఁడె నేర్చు

తే. నార్యజనులనుబోషింపనతఁడె నేర్చుఁ, గానియొరులందునీనేర్పు గానుపింప
దనుచు సకలజనంబులు వినుతిసేయ, వెలసెనెంతయు రాఘవోర్వీభుజుండు. 187

## బి రు ద గ ద్య ము.

జయజయ, స్వస్తి, నిస్తులప్రతాపతపనోదయనిరస్తపరిపంథిసామంతాధికా రాంధకార, వసుంధరాభారభరణధురంధర, సీమంతినీజనమందహాస చంద్రికా

వికాస, అనన్యసామాన్యసకలగుణనివాస, యవనబలమర్దనోత్సాహ, తుళువబలసం
హారవిహార, శబరకులబలనిహననవినోద, వాసుదేవచరణకమలసేవాసక్తచిత్త, శర
ణాగతవజ్రపంజర, వీరవ్రతశీల, కవిపుంసరసకవితాకర్ణనకర్ణాభరణ, మహాదానకంక
ణమణికంకణ, ఉత్సాహసహాయ, శౌర్యసామ్రాజ్య, సోమదేవరాజతనూజ, రాఘ
వరాజ, విజయీభవ, దిగ్విజయీభవ. 189

వ. అని కవిభటానీకంబులు పొగడ, రాఘవమహీపాలుండు ధర్మంబున రాజ్యంబేలె.

సీ. జహ్నుతనూభవ జవగతినుడుగక కడునడిఁబఱచి సాగరముఁజేరెఁ
కల్పద్రుమములైదు కంపించి శాఖోపశాఖల మిగులనాకలకుఁబాలె
భుజగేశుఁడంతేని బుసచేత మలకలుమలకలుగా రసాతలముఁదూలె
సురధేనువొకవడిఁబఱుపున వనిఁజేరి పూరినిఁగరిచెను సారెసారె

తే. నౌర వీరారిగర్వవిదారియైన, సోమదేవునిరాఘవక్షోణిపాలు
దశదిశాత్యంతపరిపూర్ణధవళకీర్తి, లలితనిర్మలరుచిహాసాహాళికి బెదరి. 191

మ. అరయన్ రాఘవుపావకాంబకము మున్నావాహినీనాథునో
క్కురునిన్ స్రుక్కఁగఁజేసె రాఘవమహీకాన్తామనోహారిబం
ధురతేజంబనుపావకామ్బకము శత్రుక్షోణిభృద్వాహినీ
శ్వరులన్ బెక్కురనుక్కడంచుననుచున్ వర్ణింతురుర్వీజనుల్. 192

చ. పరబలభేది రాఘవనృపాలుఁడు పంకజనాభుఁగూర్చియ
గ్రామములునగ్రహారములుదాత్తమతిన్ దగఁజేసి ధారుణీ
సురులకొసంగెఁబర్వముల శుద్ధసువర్ణగవాదిదానముల్
గరిమనుబిన్నశౌరిని జగద్వినుతున్ ఘనుఁగాంచె వేడుకన్. 193

క. ఆపిన్నశౌరి శాత్రవ, భూపాలురనెల్లఁగెలఁబోరిగొని బాహా
టోపమున నేలె ధర సుఖ, మాపాదించుచును జనులకలజడి మాన్పెన్. 194

చ. కుపితవిరోధిరాజమదకుంజరసింహము పిన్నశౌరియే
యుపుడమియందు నెందుఁగలలోపల నైనను గేలి నైనను
గృపణవిషంబు లోభమును గిల్బిషవర్తనబొంకునోటమిన్
గపటమసూయగోపమును గర్వముఁబుట్టదు లేశమాత్రమున్. 195

చ. అనఘుఁడు పిన్నశౌరి సుజనావనదక్షత రూపరేఖలన్
వినుతపరాక్రమంబునను విశ్రుతదానగుణంబు పెంపునన్
వనజదళాక్షుఁడత్తనయుఁ వానివిరోధిని వానిమిత్రుఁ దా
నైనయగు దీటునచ్చు నతిరెయొంతయు సాటగుఁజూడఁజూడఁగన్. 196

తే. పిన్నశౌరియశము వెన్నుకేళాకూళి, విన్నవాఁకఁబలుకవేలఁదిఁబుడుకు
దొడుకు రిక్కలేని నొడలిచూపాడయని, మేటితేజిఁబోలు దీటు లేమి. 197

ఆ. వైరిధారుణీశవంశపారావార,ముల దహించు మిగులఁజెలఁగి జనులు
సన్నుతింపఁబిన్నశౌరిప్రతాపంబు, బాడబానలంబుకగిదిఁదనరి. 198

క. ఆరాజేంద్రుఁడు బుక్కధ,రారమణునిఁగాంచెనతఁడు రాజకులసుధా
పారావారనిశాకరుఁ,డై రాజిలె సరససత్కళాయాఢిమెయిన్. 199

చ. అతివిభవంబునన్దితిసుతాహితరాజు మహాపరాక్రమో
న్నతి మృగరాజు సోయగమునన్మరాజు సమస్తధర్మప
ద్ధతినలధర్మరాజు పటుధైర్యమునద్రిరాజు వాక్ప్రశ
స్తత ఫణిరాజు నిర్దళితశాత్రవరాజగు బుక్కరాజిలన్. 200

శా. చక్షుశ్శ్రోత్రనరాహకూర్మగిరిరాట్సాంగత్యమున్మాని సం
రక్షాపేక్ష మనంబునన్దలఁచి గోత్రాదేవియెల్లప్పుడా
నక్షీణాధ్వరయై మహాసుకృతయై యారూఢతంబొల్చె స
ర్వక్షేమంకరుఁడైనబుక్కవిభుశౌర్యస్ఫారదోఃపీఠిపైన్. 201

సీ. అడుగనిచ్చితినిష్ఫలంతియ లేదనుమాటదాఁబుట్టదేనాఁటనైన
గెలిచి నచ్చెటె కాని కలననోటమియనుమాటదాఁబుట్టదేనాఁటనైన
మనవెంతచెప్పిన విని పరాకుగఁజేయుమాటదాఁబుట్టదేనాఁటనైన
మొదటన చనవిచ్చి తుదనది వేఱగుమాటదాఁబుట్టదేనాఁటనైన
తే. ననుచు జనులెల్లఁబొగడఁగనారవీటి, పురము నేలుచుఁదనకులమునుదదాఖ్య
నలర వెలసెను సతతకృతాధ్వరుండు, రాజపరమేశ్వరుఁడు బుక్కరాజవిభుఁడు.

## బి రు ద గ ద్య ము.

జయజయ, స్వస్తి, శ్రీసంతత వేంకటాచలపతిచరణారవిందసేవాకందళిత సామ్రాజ్యసుఖోపభోగ, సాళువనరసింహరాయరాజ్యప్రతిష్ఠాపనాచార్య, శౌర్య గరిష్ఠ, సకలకళావిశారద, దైనందినవితరణానానాదిగంతరాగతవనీపకజాలపరిపాలన గుణవిశేష, అసహాయశౌర్య, సుమేరుధైర్య, అష్టాదశవిద్యాప్రజ్ఞాప్రవీణ, రాజ కులాభరణ, రాజరాజేశ్వర, పిన్నశౌరిరాజతనూజ, బుక్కరాజ, విజయీభవ, దిగ్విజయీభవ. 203

క. అని సకలరాజసభలను, వినుతింపఁగ బుక్కరాజవిభుఁడొప్పెను స
జ్జనులనుగాచుచు దుష్టులఁ, దునుముచు ధరనేలె మిగుల దోర్బలశక్తిన్. 204

క. సోమాన్వయాబ్ధిరాకా, సోముండగుబుక్కరాజ సుత్రాముయశ
శ్రీమించెఁ దెగడె గెలిచెను, గామదుఘుఁ గామపాలుఁ గామవిదారిన్. 205

మ. పురముల్మూటినినొక్కపెట్టుగను రూపుమ్మాపునీశానుపెం
పరయంజాలినబుక్కరాజమణియత్యుగ్రప్రతాపంబు మే
దురమై దిక్కులనిండఁబర్వుచుఁగవిస్తోత్రక్రియాపాత్రమై
సారిదిక్ శాత్రవకాననంబుల దహించున్దావవహ్నిక్రియన్. 206

సీ. ఆబుక్కరాజేంద్రుఁడబ్బళదేవి బల్లాదేవియనుసతులను పరించి
యబ్బళదేవియందాత్మజులను సింగవిభుఁడాదిగాఁగను వేఱ్కఁగాంచి
నందేలయొసఁగనానందనులాపురిఁదమకును నిజరాజధానిగాఁగ
నేలుచుఁగులము నందేలపేర ధరిత్రిఁదనరఁగఁబుత్రపౌత్రాభివృద్ధి
తే. నతిశయిల్లిరి మఱియునున్నృపాలుఁ, డనసుతనుఁడు బల్లాదేవియందు రామ
భద్రవరలబ్ధజనితునత్యుద్రశౌర్యు, భానునిభతేజు రామభూపాలుఁగనియె. 207

సీ. మదకరికొకటికిర్వది గుఱ్ఱములు గుఱ్ఱమునకును విఱుకాండ్రు ముగుర విచ్చు
కత్తులవారికొకాండ్రట్లవర్లినిట్టియేనుఁగులనుజొట్టు మూడు
వేలయేనూఱునుద్వృత్తితోనడనంగఁగందనోల్సాధింపఁగాఁదలంచి
మొనఁద్రుంచి గట్టిగా ముట్టడిదిగినసాబిబ్బని మిక్కిలియుబ్బుటంచి
తే ప్రకటసప్తాంగములఁగొని రామవిభుఁడు, కందనోల్రాజధానియుఁగాఁగ వసుమ
తియును నేలి మహాహవదీక్షఁబూనె, బలిమికలిమినాశానకీసకులఁ బెనుప. 208

చ. పుగఁటిమికోర్వలేక దయమాలటు జ్ఞాతినియుక్తబుద్ధిచే
సగరతఁగన్నతీర్థమిడఁజాలకసర్భకుఁడున్నఁజూచి శ్రీ
నగధర నీవె దిక్కని జనంబులుగన్గొననంతఁగ్రోలియా
సగరునిఁబోలి రామన్నపచంద్రుఁడు చెందఁడు తద్వికారముల్. 209

## బి రు ద గ ద్య ము.

జయజయ, స్వస్తి సమస్తప్రశస్తసమయ బలరజోమిళితసప్తసాగర ఘుంఘుమితకల్లోలజాల, శరణాగతపాల, హల్లిసుసేనోల్లాసితసప్తశతసైంధవగ్రహణపరాక్రమధుర్య, రత్నసానుధైర్య, దుర్వారతరసవ్వాయిసైనికహరణ, సవాబిబ్బిరాజసప్తాంగహరణమార్గచరణ, రణభయయానకజయాన కారవముఖరీకృతకులగిరిదరీనికర, పోషితావనిసురప్రకర, నిరవాపాదపనీదుర్గనివాసికాసపుడయ దుర్మదఖలనిర్మథన, కర్మధారేయ, దానగాధేయ, వీరరమాసమారోహణారంభసోపానదో

స్తస్తంభ, వాక్కుంభీనససార్వభౌమారంభ, పరిపంథినృపపుండరీకాధిపరాజమండల
కబళనవ్యగ్రమోదగ్రమండలాగ్రసింహికాతనూజ, రామరాజ, విజయీభవ, దిగ్వి
జయీభవ. 210

క. అని బిరుదు పొగడఁగా బుక్కనృపాలునిరామభూమికాంతుం డలరున్
వననిధిపరీతధాత్రీ, జనముల నయస్ఫూర్తిఁ బ్రోచి సన్నుతిఁ గనుచున్. 211

సీ. పరమధర్మంబున వరవిభవంబున సరి ధర్మతనయుండు హరిహయుండు
సత్కాంతిసొంపున సంపదపెంపునఁ బ్రతి యామినీరాజు రాజరాజు
కమనీయగుణమున ఘనవితరణమున నెన దశరథరాముఁ డినసుతుండు
విక్రమప్రౌఢి సద్విమలతేజోరూఢి సాటి నరుండు వైశ్వానరుండు
తే. గానియితరుల నెటు దీటుగా నుతింప, వచ్చు సతతనతసకలవసుమతీశ
మకుటమణిఘృణిసువిరాజమానచరణ, జలరుహుండగు రామరాజప్రభునకు. 212

సీ. జగడాలు పచరించుజడదారిఁ జౌదంతిఁ దలవాకిట నెపుడు మెలఁగుపోలఁతి
నల్లవలువ దాల్పుఁ జెల్లనిబలుఁ డీవిఁ గన్నులు చెవులుగాఁ గలుగు ఱేని
వెన్నునియన్నన్న వేల్పులదొరవాలు నపదిమోములనలరుసామిఁ
జుట్టుకైదువజోదు గట్టులరేకిమీనిఁ బుడుకుఁదోడుకుమతిపుడుకుఁ జెట్టు
తే. బొబ్బమెకమును నీరింకుమబ్బునుబ్బు, గెబ్బు సంతతవిజయజేగీయమాన
మగుచుఁ జాళుక్యనారాయణాంకుఁ డైన, బుక్కరాజేంద్రురామభూభుజునియశము.

మ. ఒకకందర్పునిఁ గూల్చె శంకరునికోపోద్రేకఫాలాక్షిపా
వకుఁ డే హెచ్చది రామభూవిభునిదుర్వారప్రతాపాగ్ని వా
రక విద్వేషిమనోజగర్వముల సంగ్రామక్షమామండలిన్
వికలత్వంబు వహింపఁ జేసె సకలోర్వీనాయకుల్ మెచ్చఁగన్. 214

చ. సరసిజసద్మతో మిగుల సాటగు లక్షణలక్ష్మిఁ బొంగి సై
పరఁగిన లక్కమాంబను వివాహము బుక్కనృపాలురామభూ
వరుఁడయి యాపులోమజను వాసవుఁ బోలి మహానురక్తి సు
స్థిరతరభోగభాగ్యములఁ దెప్పలఁ దేలెను లక్కమాంబతోన్. 215

క. ఆరామనృపతికి మహో, దారుండగు తిమ్మరాజు ధన్యుఁడు కొండ
క్ష్మారమణుఁడు బుధనుతస, చ్చారిత్రుఁడు రంగవిభుఁడు జనియించిరొగిన్. 216

క. ఆతతభుజబలమున రిపు, భూతలనాయకులఁ గలనఁ బొరిగొని కీర్తి
శ్రీతరుణిఁ గాంచె విద్వ, ద్వ్రాతములకుఁ దిమ్మనృపతి ధనమిడి వేడ్కన్. 217

క. ఆతిమ్మనృపతి భూకాం, తాతిలకంబైనయవ్వుకుఁదానేలుచు వి
ఖ్యాతిగనప్పూరిపేరన్, బ్రీతినిఁదనకులము వెలయఁబెంపొందె మహిన్. 218

క. ఖండనభూమిని సాళ్వా, ద్గాండీవిదలింపఁగొండధాత్రీనాథా
ఖండలుఁడగునని రిపుభూ, మండలపతులిత్తురరి నమస్కృతితోడన్. 219

క. దీనావనుఁడౌకొండము, హీనాఘుం డాదవేని నేలుచుఁ గరఁగెన్
దానును సుతులును దల్పం, తానంబాయాదవేనిధామము పేరన్. 220

క. ఆరాజన్యులతమ్ముఁడు, శ్రీరంగాధీశ్వరుండు శ్రితసంరక్షా
ధౌరంధర్యముచే నా, శ్రీరంగాధీశుఁడనఁగ క్షితి నుతిఁగాంచెన్. 221

సీ. అంతరంగకరణశుద్ధినైన నవ్వులకైన నాడినమాట సత్యంబు తేట
యనురక్తితోనైన నలకలనైన నింపొదవెడుచూపు సంపదలచూపు
కృతమతినైన సత్క్రీడానుగతినైన నలరెడుకేవి పుణ్యములతావి
మమతతోనైన నేమఱిరైయెనఁ దొడరుచు ర్తనపెంపుమిగుల ధర్మంబుసొంపు

తే. గాఁగనసదృశబాహువిక్రమనిరూఢిఁ, దనరెఁగర్ణాటరాజ్యపదస్థుఁడగుచు
దుర్జయాహితరాజవిధుంతుదుండు, రామరాజేంద్రుఁ శ్రీరంగరాజవిభుఁడు. 222

శా. రామాధీశసిరంగరాజవిభుఁడౌరా రాముతో సాటి సు
త్రామప్రోద్భవునుద్దియాచు శరవిద్యాప్రౌఢిచే మించియు
ద్దామామిత్రమహీశులం గెలిచి యుత్సాహంబుఁబుట్టించి సం
గ్రామోర్విన్ జయలక్ష్మికిన్విపులనారాచాతిహేలాగతిన్. 223

చ. అసదృశబాహుశౌర్యమున నారయ నెందునజాతశత్రుఁడై
వసుధ సిరంగరాజజనవల్లభుఁడేలెడి యాదినంబులన్
బిసరుహమిత్రమండలముభేద్యతనొంది చెలంగె రంభతో
నొసపరి బాగులంగదిసియుంటఁగగల్గెఁగు బేరసూతికిన్. 224

చ. అరయ సిరంగరాజమనుజాధిపునిర్మలకీర్తికాంతతో
సరిమెలఁగంగనోడి కద చాలనడంగి మడింగి భీతిచే
నురువడిఁబాటి కాలెచటనూదుటలేక మొగంబు వాంచి యా
యురగకులాధిభర్త మహినోరయి పోవుట పుట్టలెక్కుటల్. 225

మ. ఇల శ్రీరంగనృపప్రతాపముగడున్ హేరాళమై పర్వఁగా
నలఁగాంతాయుతులై చరించురిపుభూనాథుల్భయభ్రాంతిచేఁ
బ్రళయార్కాగ్నులు రెండునొక్కటయి భూభాగంబునంగప్పి రా
వలయుంజూడుఁడటంచునొండొరులతో వాక్రుత్తురల్లప్పుడున్. 226

తే. ప్రకటసాత్త్వికుఁడైనశ్రీరంగరాజు, లక్ష్మికెనయైనలక్షణలక్షితాంగి
యైనతిమ్మాంబనుద్వాహమై చెలంగె, నధికతరభోగభాగ్యంబులతిశయిల్ల. 227

చ. అతనికిఁదిమ్మమాంబకు గుణాఢ్యుఁడు కోనఘనుండు సత్కృపాం
చితమతి తిమ్మరాజు నృపసింహుఁడు రామవిభుండు నార్యస
న్నుతుఁడగుతిర్మలేంద్రుఁడు మనోజనిభాకృతియైనవేంకట
క్షితిపతి పుట్టిరంతయును శిష్టుల దుష్టులఁబెంపనొంపఁగన్. 228

ఉ. వారలలోననగ్రజుఁడు వారిసముద్భవుపై రిపంక్తి వి
స్తారుఁడు కోనభూపతి బుధప్రకరంబుల నైజదానదీ
క్షారతిఁజండబాహుబలశాత్రవసర్గము నైజదానదీ
క్షారతి దివ్యభోగములఁగల్గఁగఁజేయు దయాతిసారతన్. 229

క. హితమతియగుకోనమహీ, పతికి రికినుద్దిగాఁగఁ బఱతెంచి తదం
చితగరిమకోడి ఖ్యయమున, క్షితిధరజాధిపుఁడు మూలశిఖరి వసించెన్. 230

ఆ. అతనియనుఁగుఁదమ్ముఁడగుతిమ్మభూపాలు, ఐదుర్యుఁడలరుఁగీర్తిధుర్యుఁడుచు
ధైర్యుఁడార్యవినుతచర్యుఁడంభోధిగాం, భీర్యుఁడసదృశోరుశౌర్యుఁడనఁగ. 231

సీ. జేజేలరాయనిఁజెనకి కైకొనియెనో పర్ణితంబైనట్టిపౌఘంబుఁ
దలిరువిల్తునినోడఁదరిమి కైకొనియెనో సొగసైనయట్టినంటిసోయగంబుఁ
బుడమిదాల్పునకెనఁబోలి కైకొనియెనో యంచితంబైనవాక్సంచయంబు
నళికలోచనునటుగెలిచి కైకొనియెనో రహిఁగుక్కడునిబ్బరంపుఁగలిమి

తే. ననఁగఁద త్తిమ్మనఖ్యాతినతిశయిల్లె, సర్వసర్వంసహాజనసన్నుతప్ర
తాపనిర్జితపరిపంథిధరణిపాల, తేజుఁడైనట్టియాన్వీటితిమ్మనృపతి. 232

తే. తత్క్రమంబునఁబ్రాలేయధామవంశ, మతికృతోద్ధర్ష్యము [illegible] హారదలంచి
రామరాజనసుదయించెనామహీపు, నసజుఁదిరుమ [illegible]. 233

సీ. పిశితభుక్కటకృద్ధి [illegible] యైనపంకజాతుండు [illegible]వాఁడు
భవ్యసత్కమసంగరణుఁడై గంజల్లి [illegible] ప్రుండు [illegible]వాఁడు
కరినేభలేఖారిగిరిహ్యాపహారియాగరశరాసనుడు [illegible]రణివాఁడు
ప్రస్ఫుటకమజబాంధవుండైనట్టిజగదంబకుండు [illegible]సాటివాఁడు

తే. అతికృపానూనకాంతిమహావిభూతి, తేజములఁగాకయితరులు దీటెయనుచుఁ
గవిజనానీకవర్ణనఁగాంచు జగతి, రహి నహించెనుదిరుమలరాయమౌళి. 234

సీ. ఏఘనుసౌందర్యమిందిరానందనుసందమై సతులకానందమొసఁగు
నెవ్వనివితరణమిందీవరాప్తునిరీతినర్థులకతిప్రియమొనర్చు
నేరాజుభేరీభాంకారంబు రిపురాజతరుణులగర్భభేదనముఁజేయు
నేనృపాలునిసేనయెదిరించుఅట్టడిరాకుమారులనుజీకాకుపఱచు
తే. నతఁడు నృపమాత్రుఁడేయరయను సపాద, కుతుపశాహినిజామాదికుతలపతులఁ
గెంటెదోర్దర్పఖర్వితాఖండలుండు, రణజయవిహారి తిరుమలరాయశౌరి. 235

చ. సరసిజపత్రనేత్రుఁడగుశౌరి పయోనిధికన్యకన్వయ
చ్చరులు నుతింపఁజేకొనినచందమునన్సుగుణాభిరాముఁడా
తిరుమలరాయశేఖరుఁడు ధీనుతులొప్పఁగ వెంగళాంబనుం
బరిణయమయ్యె వేడుకనపారమహావిభవంబులొప్పఁగన్. 236

క. పతిభక్తిచేనరుంధతి, స్తుతి సంపదచే సరోజభవనసరిగ స
న్నుతిఁగన్న వెంగళాంబకు, నితరవధూజనము సరిగనెట్లెన్నఁదగున్. 237

శా. ఆరామామణియందుఁదిర్మలనృపాస్యత్తుండు ప్రేమున్గనెన్
నీరేజాప్తసమానులన్సుతుల నిర్ణిద్రప్రతాపారిసం
హారోగ్రప్రతిమానశౌర్య రఘునాథాఖ్యక్షమాభర్తనున్
శ్రీరంగాధిపు రామరాజవిభునిన్ శ్రీవేంకటాధీశ్వరున్. 238

క. ఆతిరుమలరాయతనూ, జాతచతుష్కమునన గ్రజనితుండును వి
ఖ్యాతయశుఁడు రఘునాథమ, హీతలనాథేశుఁడలరునినసన్నిభుఁడై. 239

మ. సమరోర్విన్రఘునాథరాజనరుఁడశ్వంబుద్ధతిన్ద్రోలి శౌ
ర్యమహాగ్రంథనవొప్పి త్రుంచెనుదురుష్కాధీశులస్త్రోతుఁబ
ల్లము గుల్మంబును నాఱుతుంటలయి ఢొల్లన్వేటువేటట్లుగా
నమరుల్గన్గొని మేల్మేబాపు భళియానౌనంచు వర్ణింపఁగన్. 240

సీ. నీరూపురేఖతో నేసరియంచుఁబెనంగి మీనాంకుఁడనంగుఁడయ్యె
నినాక్ష్మరణిరేన సేనిల్తునని మోడి నిలువనోపఁడు రసాతలముఁ దూరె
నీకీర్తికని జుసు నేనని గాటుగాక యుష్ణాంశు చిక్కెగా హరిణమునిచె
నీప్రతాపముతోడ నేనని నిలుపనికి ఖరకరుండుడుమపథఁబాఱనఁజొచ్చె
తే. నౌర నీసాటియెవరలట్లనఁగ నొప్పె, నష్టదిగ్రాజహృదయభయదపరాహ
విరుదనతనుఁబరగిరభిసురపాణి, యైనరఘునాథమేదినీజానియలరు. 241

క. ఆరఘునాథమహాధా, త్రీరమణునియనుజుఁడైన శ్రీరంగవిభుం

డారాముమాడ్కి వసుమతి, నారూఢిగనేలె నిర్జితాహితుఁడగుచున్. 242

సీ. తొలిపల్కుగుర్తాలఁదోలెడు నెఱజాణకూర్మిముమ్మనుమనికొడుకుకొడుకు
జాలుఁదొయ్యలి నేలుజాణయెన్నెడువాని కొమ్మపైదోడులోఁగొన్నయతఁడు
చిలువలఁదినుచుండుపులుఁగుఁద త్తడినెక్కునట్టి వేలుపుగేస్తురాలికొడుకు
చిలుకపైఁజనువానిచెలికానిచేరువపొరుగూరనుండెడిదొరసుతుండు
తే దానగాంభీర్యసౌందర్యధర్మములను, సాటివత్తురుగాకొరులన్సరెతలఁప
నారవీటిప్రఖ్యాతుఁడాతిరుమల, రాయదేవేంద్రు శ్రీరంగరాయమణికి. 243

సీ గడివిజాపురవరకామినీగర్భముల్ భేదించునెవ్వని భేరిరవము
దామిడిబోయి నిజాముపట్టణముల ధూళిగాఁజేయునేదొరబలంబు
గోలకొండనజీర్ల కోటులకాయముల్ చించునేరాజేంద్రు చేతికత్తి
సకలభూపాలకాస్థానసన్నుతిఁగాంచి వెలయునేశూరుని విజయలక్ష్మి
తే. యతఁడుకేవలనృపతియే యఘవిదూర, చర్యుఁడాశ్రితరక్షావిచక్షణుండు
జీర్ణకర్ణాటభూపునర్జీవనుండు, రమ్యగుణశాలి శ్రీరంగరాయమౌళి. 244

తే రాజగుణహారి శ్రీరంగరాయశౌరి, ప్రీతితోఁదిమ్మమాంబను బెండ్లియయ్యె
నావధూవరులఖిలసౌఖ్యముల మిగుల, వెలసిరవని ధరాత్మజేశులనుబోలి. 245

క. ఆవిభుతమ్ముఁడు రామన, రావల్లభుఁడలరు నాదిరాజులచర్యల్
ధీవరనుతరాకేందుయశో విస్తారతనునధికశూరత్వమునన్. 246

మ. ఘననిర్ఘోషము శైలరాజతనయాకాంతోరుషక్కాహళ
స్వనమున్గెల్చిన రామరాజవరునిస్సాణంపునాదంబులే
విని శూరేతరులై తురుష్కయవనోర్వీనాయకస్వామినీ
జనయుక్తంబుగ డాగియుందురు మహాశైలంబులన్గానలన్. 247

ఉ. రామమహీశ్వరుండు రణరంగమునందు నిజామునేనలన్
భీమపరాక్రమస్ఫురణఁబీఁచమణంపఁగ సాటికెన్నుచున్
రాముఁరణంబుచందమిది రాయితఁడాతఁడెయౌనటంచునా
తామరసోద్భవోద్భవుఁడు తాళములొత్తుచు నాట్యమాడుచున్. 248

క. కృతకృత్యుండగురామ, క్షితిపతి నరసింగమాఖ్యసీమంతినినం
చితధర్మవిధినిఁబరిణయ, మతిముదముదలిర్పనయ్యెనాసతివలనన్. 249

క. ఆజనపతి కాంతివిభవ, రాజేంద్రుని విజయనిభపరాక్రమరేఖా
రాజితఘను శ్రీతిరుమల, రాజునుగనియెఁదదనంతరంబున మఱియున్. 250

క. అతనికి శ్రీరంగమహీ, పతిగలిగెను నామహానుభావుఁడు శౌర్యో
న్నతి వేంకటపతిరాయన్నృ,పతిచేయువరాజపట్టబంధమునొందెన్. 251

చ. తిరుమలరాయరాజహిమదీధితి రామమహామహీమనో
హరుని సిరంగరాయవరునార్యజనస్తుతిచేఁదనర్చు నా
నిరుపమదానవైఖరుల నించె నజాండముఁ దత్క్రమంబుకై
శరనిధియప్పులంబొరలెఁజందురుఁడుంగడుఁగందె సారెకున్. 252

సీ. పాఱుదా రిపుకదంబము బెడాబెడలుగా నురువడి మొనలపై నుఱిమినపుడె
భయమందదా పద్మబాంధవుమండలంబరిఖండనోత్సాహ ముబ్బినపుడె
మోహంబుచెందదా ముగ్ధాంగనారాజి సోయగంబొక్కింత చూచినపుడె
సమ్మోదమందదా క్ష్మాజనానీకంబు కరుణార్ద్రదృష్టిచేఁ గనినయపుడె
తే. యారయసహాయశూరుఁడు నరికృతాంతుఁ, డంగనాజనమాత్మలతాంతశరుఁడు
ధర్మతత్పరుఁడనుచు భూనవులవినుతిఁ, గనియె శ్రీరంగచికరాయమనుజవిభుఁడు.

తే. రాజకులభూషణుఁడు చిక్కరాయభూప, శౌరి వరియించె జిల్లెళ్ల నారసింహ
రాజదేవేంద్రపుత్రియంభోజనేత్ర, యైనయోబమ్మదేవి నాయతినవలన. 254

తే. ఆవసుమతీశునకు రామదేవరాయ, లుదయమైనను రిపురాజులోడిఁగి శైల
గుహలఁజేరిరి రవిదోఁప ఘూకచయము, లతిభయంబున గొందులనణఁగుపగిది. 255

సీ. సింగనృపతి భీమసేనుఁడు రాయప్పశ్వేతాశ్వుఁడయ్యనచెన్నృపులు
మాద్రేయులితరభూమండలేశ్వరులు విరాటపాంచాలాదిరథికవరులు
రఘునాథనాయకాగ్రణియనుకృష్ణసహాయమ్ముగాఁగనునాజిఁజెంచు
వీరప్పయాచనవిభుమూకభూషదుశ్శాసనసౌబలశల్యకర్ణ
తే. యుక్తముగ జంగరాజదుర్యోధనుని స, ధించి సంతసమున రామదేవరాయ
ధర్మతనయుండు ప్రజలు మోదంబెలర్ప, ధరణిఁబాలించె ధర్మవిస్ఫురణ మెఱయ.

సీ. రాజాధిరాజవీరప్రతాపోజ్జ్వలుఁడగు రామదేవరాయన్నృపతుహీన
ధాముఁడు పోచిరాడ్రామరాజాత్మజయోబమదేవి గొబ్బూరివంశ
పావనుఁడరిగిరిపాకారి యతిరాజుసుత కొండమయుఁగులసతులుగాఁగ
వరియించి యోషితాద్వయమతిధర్మసహాయమై పర్తిల్ల నధ్వరములు
తే. భూసురోపనయనతులాపురుషకన్య, కాశ్వగజగోహిరణ్యవస్త్రాన్నభూము
ఖాదిదానంబులొనరించి యాదిరాజ, చర్య వర్తిల్లె భూజనుల్సన్నుతింప. 257

ఆ. రామదేవరాయరాజేంద్రుసత్కీర్తి, సాటివత్తునన భుజంగమకుల

పతికి జిహ్వ సరిగఁబగిలెనంచును భీతి, సిరి మేన నీలిచీరఁగప్పె. 258

తే. మనుచరిత్రనిట్లు సుతుఁడు పన్నఁడునుదనర, నలరురామావనీభర్తకనుజుఁడైన
వీరవేంకటపతిరాయవిభుఁడు వసుధ, కెల్లరాజయ్యె భూజనులెల్లఁబొగడ. 259

సీ. బలముగూడినఁజూచి నిలువనియిభరాముకొండుకుభీతికి గోలకొండ సాక్షి
వెన్నాడి తత్సేన వీఁగఁద్రోలుటకునుబ్రవహరక్తమునను బ్బుపెన్న సాక్షి
నీవాఁడననఁ బ్రోచి నిర్భయంబుగ వానికిని మేరయిడుటకుఁగృష్ణ సాక్షి
రెుదిరించువైరులపద మెల్లనవలీలఁదూలించుటకును నందేల సాక్షి

తే. గాఁగనసదృశబాహువిక్రమవిభూతి, దనకు వేలూరు నగరాజధానిగాఁగ
వీరవేంకటపతిరాయవిభుఁడు మిగుల, ధరణిఁబాలించె ధర్మతత్పరతఁ జెలఁగి. 260

సీ. వాఙ్మహావిభవంబు వర్ణింతునంటినా భావింపఁబన్నగభర్తయతఁడు
గుణములచెలువుఁ బేర్కొనియెదనంటినా వీక్షింప శేషాద్రివిభుఁడతండు
అతిధర్మవర్తన నుతియింతునంటినా రంపవయాధర్మజుండతండు
నీతిమార్గస్ఫూర్తిరీతిఁదెల్పెదనంటినా పరికింపఁగా బృహస్పతియతండు

తే. గాన బుధజనసన్నుతిఁగన్నయార, వీటి వేంకటపతిరాయవిభునినితర
మనుజనాథులరీతిని వినుతిసేయ, నలవియే యాఘనుండు కేవలుఁడె తలఁప. 261

సీ. పరమపాతివ్రత్యగరిమచే మిక్కిలియతిశయిల్లినవెంకటమ్మగారిఁ
జిరయశోనిధియైనజిల్లెళ్లరంగనృపాధిపుపుత్రి నోబమ్మగారి
జిల్లెళ్లకృష్ణరాట్ప్రీతమయూఖుప్రియాత్మజయైనకృష్ణమ్మగారి
భూరిశౌర్యోగ్రగొబ్బూరియోబళమాత్యుతనూజఁగొండమ్మగారి

తే. నెమ్మి వరుసఁబాణిగ్రహణమ్ముఁజేసి, వీరవేంకటపతిరాయవిభుఁడు వేడ్క
నలరునప్పద్మముఖులతో ననుదినంబు, నధికసౌఖ్యాంబునిధినోలలాడె మిగుల. 262

ఉ. ధీరసు మేరు వేంకటపతిక్షితినాథునిచారుకీర్తిదా
నారయఁబద్మజాండమున నంతట నిండి పొగడ్తఁగాంచె స
ద్ధీరులచేతనయ్యమృతదీధితికిన్బుజమధ్యపంబునన్
భూరికళంకమున్నొరపెఁ బోల్కకి సేసెనయంచుఁదోఁచినన్. 263

తే. రహినినిటువలె యామిసీరాజవంశ, వర్ధనుండగు తిరుమలవసుమతీశు
ననుజుఁడగు వేంకటాద్రిరాజావతంసుఁ, డలరునాదిమనృపచర్య మెలఁగి మిగుల.

ఆ. అసదృశోరుశౌర్యుఁడాహవగాండీవి, వేంకటాద్రిరాజవిబుధరాజు
అని బిరుదు గెలిచియాతనిబిరుదుమే, లమ్ముఁగొనిరెు భూజనమ్ము వొగడ. 265

సీ. కందుకక్రీడఁగాంగదనరంగస్థలిఁగడు వజీరులపుస్తకములఁదునిమి
హారులనుబోరిగొని కరులనుదునిమి తదారోహకులఁద్రుంచి వీరభటవి
దళనంబుసేసి దుర్ధరపతాకలఁగూల్పఁగనుఁగొని కాందిశీకత వహించి
వీఁకఁబట్టినునాస విడిచి నిజాము యేదులఖాను కుతుపశాహులదళంబు

తే. విచ్చ వెన్నిచ్చి కనుకనియిచ్చఁబఱచి, మెచ్చఁజొచ్చిననభయంబునిచ్చి విజయ
కాహళులుమ్రోయనియమించె క్ష్మాజనంబు, లభినుతులొనర్పఁగా వేంకటాద్రిరాజు.

ఉ. ఏలెనుగందనోలుపుర మింద్రసమానుఁడు వేంకటాద్రిభూ
పాలుఁడు ధర్మరీతినరివర్గము బీరముదక్కి మత్తశుం
డాలతురంగహేమఘననవ్యమణీచయమిచ్చి రేపగల్
ఫాలతరాగ్రసీమఁగరపంకజయుగ్మముఁజేర్చి కొల్వఁగన్. 267

చ. అనిశము గోహిరణ్యవసుధాశ్వతులాదిసమస్తదానముల్
వనరుహనేత్రుఁగూర్చి ద్విజవర్గము రాగిలనిచ్చి రంగమాం
బను మఱి కృష్ణమన్దగ వివాహమునై క్రమమొప్ప వారిన
ల్లనుగనె వేంకటాద్రినృపలక్ష్ముఁడు రంగపరామరాజులన్. 268

తే. దర్పితారాతిగర్వవిదారకాత్తి, చండదోర్దర్వమండితమండలాగ్ర
పాండితిని మించె రామభూపాలుఁడఖిల, రాజసన్నుతులెసఁగ ధరాతలమున. 269

ఉ. సంగరరంగమందు హరిశౌర్యమునన్బ్రవనైకదీప్తుఁడై
రంగపరాజశేఖరుఁడరాతిబలంబులనుక్కడంచె సా
రంగధరుండొ యాపరశురాముఁడొ స్కందుఁడొ రాఘవుండొ యు
న్నంగనితండటంచును జనమ్ము సన్నుతులుల్లసిల్లఁగన్. 270

మ. ధరణీచక్రము నాల్గుపాదములచే ధర్మంబు వర్తిల్లఁగాఁ
బరిపాలించెను రంగపాధిపుఁడు శుంభద్బాహుగర్వోన్నతి
స్థిరుఁడామేటి మఖంబులన్ద్విజులచేఁజేయింపఁగా దేవభూ
సురసంఘంబతితుష్టిచే సిరులచే శోభిల్లనశ్రాంతమున్. 271

శా. నెమ్మిన్ రంగపరాజశేఖరుఁడు కోనేటమ్మఁదిమ్మమ్మఁ జె
న్వమ్మమ్మువ్వురఁబెండ్లియయ్యెను బ్రమోదాయత్తుఁడై బంధులో
కమ్ములెచ్చ మహావిభూతినిటులాకాంతామణుల్దాను సౌ
ఖ్యమ్ముంగాంచెను ధర్మతత్పరతనత్యంతంబు వర్తిల్లుచున్. 272

క. అతనికిఁగోనేటమ్మకు, గతకలికల్మషుఁడు విమతఖండనుఁడు గుణా

న్వితుఁడైనవేంకటాద్రి, క్షితిపతి జనియించెనార్యకీర్తనలెసఁగన్. 273

క. ఆరంగపరాజఘరి, శ్రీరమణునకుదయమయ్యెఁ దిమ్మాంబాయో
పారతప్పమువలన మహో, దారుఁడు గోపాలరాజధన్యుం డెలమిన్. 274

సీ. శ్రీకృష్ణగోపాలసేవావిహారవిచక్షణుండురుధర్మరక్షణుండు
నందిపకుపుత్యానందకరాన్వయమండనుండఖిలారిఖండనుండు
రాజీవపత్రేక్షణాజనతాపంచసాయకుండర్థదాయకుండు
బాహుబలోగ్రసపాదమహాబలభంజనుండాశ్రితరంజనుండు
తే. సతతసేవకనరనరాంచిలికిరీట, ఘటితమణిఘృణిలలితాంఘ్రికమలుఁడాగ
వీటిగోపాలరాజభూవిభుఁడు కంద, నోలు నిజరాజధానిగానేల ధరణి. 275

క. చాల విశీర్ణినిఁగర్ణుని, బోలును దుర్జయవిరోధిభూపాలకగో
పాలవధూటీజనగో, పాలుఁడు గోపాలరాజ పార్థివుఁడెలమిన్. 276

ఉ. శ్రీలెలమిన్దైలంగఁగ వరించె ముదంబున రంగపేంద్రుగో
పాలనృపాలచంద్రుఁడతిపావని గొబ్బురిగిర్యధారుణీ
పాలునిపుత్రి వేంగమనుపంకజనేత్ర జితేళ్లరంగగో
త్రాలనామనోహరసుతామణిఁదిమ్మనునున్నహోన్నతిన్. 277

క. ఆపద్మముఖులుదన్మననను, రూపగుణంబుల భజింప యూఁథిగఁగాంచెన్
గోపాలరాజరాజని, శాపతి సతతంబు సకలసౌఖ్యము లెలమిన్. 278

తే. అనానినిటునలెఁబుత్రపౌత్రాభివృద్ధి, రహిని వర్ధిల్లతిరుమలరాయవేంక
టాద్రిరాజానుజద్వయమధికశక్తిఁ, గొలువ నళిరామభూపాలుఁడలరు మిగుల.

తే. సలకవిభుతిమ్మరాజుసేనలనుద్రుంచి, గుత్తిఁబెనుగొండ మఱి గండికోటఁగంద
నోలుపురమాదవేనవలీల గెలిచి, తొలుదొలుత రామనృపతి దోర్బలము మెఱసె. 280

శా. తారాధీశ్వరగోత్రపాలనచమత్కారుండునై దానవి
స్తారోదగ్రతనర్థి మించి రిపులన్ దండించి ధాత్రీజనా
ధారప్రక్రియనొందియింద్రజిపురాధ్యక్షేశుఁడై మించు మా
శ్రీరంగేంద్రునిరామరాజవిభుఁడాశ్రీరాముచందంబునన్. 281

సీ. హరిశౌర్యుఁడగుతిర్మలాధీశ్వరుండుదదనరజుండగు వేంకటాద్రిరాజు
భుజయుగంబుగ బలస్ఫురణతోఁగరిహరిపరవీరభటులతో దొరలతోడఁ
దనయాజ్ఞమీఱినకినుక నిజాముపై దండెత్తి లతిమియుద్దండవృత్తి
నతఁడేలుచున్నట్టియామదానగరంబు చాలెత్తి మఱియామదాలు చేసి

ఆ. సేతుకాశిమధ్యభూతలనుతజయ, శ్రీవరించి వేడ్కఁ జేఁజెలంగ
రామమూర్తియైనరామరాజేంద్రుఁడు, సాంద్రవిభవజితసురేంద్రుఁడెలమి. 282

సీ. దళితనిజానూదిబలశోణితప్రవాహినులచే జలధినేఁకనుఁడు నింపెఁ
గుమరుకోసలమత్స్యకురుకరూశాదిభూపతులచేఁ గాన్కలే ప్రభువుగొనియెఁ
దనపేర దేవతాస్థలులనవసరముల్భక్తితో నెప్డు నేపతియొనర్చ
నతిరాత్రపౌండరీకాదియాగమ్ములు సేయించి ప్రీతి నేక్షితిపుఁ డలరె
తే. నతఁడు కర్ణాటరాజ్యరమాధినాథుఁ, డార్యరక్షావిచక్షణుండద్రిధైర్యుఁ
డనఘచారిత్రుఁ డఖిలరాజాధిరాజ, రాజపరమేశ్వరుఁడు రామరాజవిభుఁడు. 283

క. నడతయొకింతయు లేదె, క్కడు బహుగంధములుఁ బాఁగుకొనునని గిరులన్
విడిచి సుఖవసతిఁ గొఱకై, పుడమిపడఁతి రామరాజుభుజమున నిలిచెన్. 284

శా. రారాజేయభిమానశీలుఁడు సుభద్రానాథుఁడే ధన్వికం
పారిఘోద్భవుఁడే సురూపి రవియే యత్యుగ్రతేజుండు మం
దారక్ష్మారుహమే ప్రదాత విధుఁడే నందత్కళారాశి మా
శ్రీరంగాధిపురామరాజమహిభృచ్ఛ్రితాంశ వర్ణించుచోన్. 285

ఉ. యామవతీశవంశకలశాంబుధిపూర్ణసుధామయూఖుఁడౌ
రామనృపాలుకీర్తిసరి రానుబెనంగి తొలంగి మూలను
ద్దామతఁ గొండయెక్కి హిమధామధరుండురుభీతి మేనఁ దా
సామున నార్యనుంచి మఱి సామునఁ గప్పె మదేభచర్మమున్. 286

చ. ఎలమిని రామరాజవసుధేశుప్రతాపమపార్యమై మహిన్
జెలువుగ నిండఁబర్వ శశిశేఖరదివ్యమహాశితాశుగ
జ్వలనశిఖాసముత్కరముచందమునందము నొందె నెంతయున్
సలకయతిమ్మయప్రముఖశత్రుపురంబుల నెల్లనారయన్. 287

## బిరుదగద్యము.

జయజయ, స్వస్తి, సమస్తసన్నుతస్తోమభద్ర, రణరంగరామభద్ర, కల్యాణమహీపాలభాస్వర, కల్యాణపురనరాధీశ్వర, కన్యాకుమారీ భీమరథీ తటాంతనిక్షేపితవిజయస్తంభ, స్తోత్రార్హయశఃప్రక్రియాపావనచరిత్ర, ఆత్రేయగోత్రక్షత్రియకులపవిత్ర, మహితకేళికాపారాయణ, మహితచాళుక్యనారాయణ, ధానుష్కచక్రవర్తిబిరుద, చాళుక్యచక్రవర్తిబిరుద, నానావర్ణమండలీకరగండ, దైత్యేభఘనగంధ, హత్తిబ్బరగండ, భాసురభుజాదండ, జయబిరుదరగండ, అసమశూరరగండ,

హొసబిరుదరగండ, గండరగండ, ఘనీకృతమదేభసరజన్యలంపట, త్రిభువన
బిరుదులవెన్నుసమ్మెట, పట్టెసరాయనిజానిష్ట, ఒడయరాయనిశాభట్టశిష్ట, సర్గరాయ
ఘనప్రియంకర, అష్టవిగ్రాయమనోభయంకర, విజయచరితసింహాసనాభాస్వర,
విజయనగరసింహాసనాధీశ్వర, యుక్తవర్గసద్యోధనపుర, గుత్తిదుర్గనిర్భేదనపుర,
వాదిపురతర్కాభరణ, ఆదవేనిదుర్గాపహరణ, ఘనచండవర్గబాధక, పెనుగొండ
దుర్గసాధక, మంద్రగిరిదుర్గభాస్వర, చంద్రగిరిదుర్గరాజ్యాధీశ్వర, శబ్దపరిశుద్ధ
పాలక, ఉద్దగిరిరాజ్యపాలక, కాయదుర్గతనయాబంధుర, రాయదుర్గాపనధురంధర,
వందనశీలకిరీటపాదక, కందనవోలుకవాటభేదక, చాటూరుఘణితినిర్వాహక, జూ
టూరుసమరనిర్వాహక, చండనపాటిఖడ్గసాయక, కొండవీటిదుర్గనాయక, పుట్టప
ల్లిసీమాధిష్ఠితధామసాగర, గట్టహళ్లిసీమాప్రతిష్ఠితధామసాగర, బంకాదపుపేరసమా
సంగిత, బంకాపురవీరరమాలింగిత, సాంద్రకీర్తినిరంతర, చంద్రగుప్తపురాంతర, ఆచా
రరాజ్యావయనచర్య, రాచూరురాజ్యహరణధుర్య, మదచండవర్గాదదాయక, ముదు
గంటిదుర్గాధినాయక, పరిభల్లచరణభూషణ, ఓరుగల్లునగరపోషణ, విజయనకరాయ
తసాయక, విజయాపురభయదాయక, సర్గనాదికరఘోషకార, సొల్లలాపురసంతోష
కార, కల్యాదినృపకబాధక, కల్యాణనగరసాధక, సామదానముఖ్యోపరంజన, అ
మదానగరసాలభంజన, ధానకరమార్గవిక్రాంతిసార, పెనగిరదుర్గసమాక్రాంతిధీర,
గాత్రమీస్నానపాపనాకార, కౌతుకాఖిలభూజనాధార, బలిచావలిజన్యదాయక,
హాలిపురచాంచల్యకారక, ఘడితపాటుతమసింహాసంహనన, పెనదతోటనగరసింహ
సంహనన, బలికిరికూటపాకలశౌర్య, కలుబరగికోటపాటనధుర్య, నగరసమాక్రమ
ణవిచార, సగరసమాక్రమణధీర, పరచండనిర్గతకింకర, పరచండనుర్గభయంకర,
సంసదుర్గకేతుహరణ, హంసదుర్గనిబర్హణ, స్వర్ణకోటకదుర్గసద్గ్రంథనాసిక, కర్ణాటక
బుధధన్యాసిక, జూటనరభయనిర్ణాయక, నిరుపనుసామజసముద్రదుర్గనిస్తాధనా
యక, సామగిరిదాపక, రామగిరిదుర్గప్రతిష్ఠాపక, మేదనీతలసమగ్రసంపాదన,
యాదగిరిదుర్గభేదన, శీలచండమృదుభాషణ, గోలకొండపురదూషణ, అయులకొండ
చండవిమతహలాహల, అయిలకొండహరణకౌతూహల, సానుగల్లుగ్రహతిపరాక్రమ,
సానుగిల్లకృతిపరాక్రమ, పానుగంటిదుర్గపాటనధుర్య, భూనుతసాహసధుర్య,
వేల్లితచండదుర్లభ, బెల్లముకొండవల్లభ, నిలయకోలగర్జితాకార, మలయకళిమహి
మాధార, కామసమాచరణాక్రమణ, సోమసదమానచరణాక్రమణ, శాఖగదుర్గబా
ధక, మావురదుర్గసాధక, ఖండితసమగ్రసంఘాచణ, దండితసమస్తశత్రుగణ,
అక్షౌరూఘరతఘౌనికర, ముక్తాకోటదతఘౌనికర, ముక్తాకోటశిఖౌనికర, అక్షౌదయసశి
ఘౌనికర, ఉల్లీఘనిజాప్తకల్లోలజాలిక, ఢిల్లీపురహల్లకల్లోలహాలిక, కలిసుమందారు

గతబృందాయక, గోలేరుసందేరూభయసందాయక, కలంబవర్గసంభాసుర, కలంబ దుర్గకంపాసుర, భూగోళరుచిరభూషణ, పైగోవనగరభీషణ, కొండపల్లిహరణ, చండకరనిభప్రతాపభరణ, వినుకొండపాలక, వినూత్నకృతనాగార్జునుని కొండ సాలజాలక, అనంతికలితపూరణ, అనంతీమదవిదారణ, కటకరాజ్యాధిపవర్తన, కట కరాజ్యఘటితకీర్తన, అజికకేంద్రదారుణశరాసన, రాజమహేంద్రరాజధనుశ్శా సన, బూదలఖానుతిక్తాంగహరణ, యేదులఖానుసప్తాంగహరణ, నిదానమలకగుణ సహజాపగాధిచారక, నిదానమలకభుజాబలాపహారక, రమాధిపవినుతాపదానకీర్తన, ఇమాదనమలకమానమర్దన, భృతరిపుదళనబంధుర, కుతపనమల్కదళసింధుర, కరీ శతరుణాకారీశసుగుణాభరణ, బరీదుబలహరణ, భుజకృతరిపుధావనావధాన, గజ పతివినుతపరాక్రమావధాన, కలికర్కశసమగ్రస్తంభీకృతారాతివర్గవిశాల, కలివర్గ మననిర్గపరతర్కవారాశివర్గకేళి, గిరిదుర్గ వనదుర్గ జలదుర్గ స్థలదుర్గ చతురశీతిదుర్గ సమస్తవళవిభాళ, రిపురాజగోపికాగోపాల, గాయగోవాళ, శ్రీరంగరాజరామ భూపాల, విజయీభవ, దిగ్విజయీభవ. 288

తే. అని హిమాచలసేతుపర్యంతధరణి, పతులసభలందు సత్కవుల్ ప్రణుతిసేయ
వెలసె నెంతయునార్వీటికులపయోధి, చంద్రుఁడైనట్టిరామరాట్టనవిభుండు. 289

తే. అనఘుఁడౌవైరసేని భీమాధిపేంద్రు, పట్టి దమయంతిచేపట్టినట్టిరీతి
రామభూపాలకుఁడు కృష్ణరాయతనయ, యగుతిరుమలాంబనుద్వాహమయ్యె వేడ్క.

చ. శతమఖునింబులోమజను శంకరునిన్గిరిపుత్రి శంబరా
హితు రతిదేవిఁబోలుచునహీనసుఖానుభవాప్తి రామభూ
పతియును దిర్మలాంబయును భానుసమానునిఁగృష్ణపాథ్యునం
చితగుణుఁబెద్దతిమ్మనృపశేఖరుఁగాంచిరి హర్ష మొప్పఁగన్. 291

సీ. మఱియునునారామమానవాధిపుండు జిల్లెళ్లకులసుధాసింధుచంద్రుఁ
డగు పెద్దనందిరాజాగ్రణిసుతనప్పలాంబనుబోచిరాజాన్వయాబ
ఉంసముఁదిమ్మభూపుప్రియాత్మజలఁగొండమ్మలక్ష్మమ్మయునన్ఁగఁబరఁగు
సరసిజసదనల నరుసతో నిరువురనతివైభవోన్నతులతిశయిల్ల

తే. సతు నిట్లమువ్వురను బంధువితతిపొగడఁ,బరిణయంబయ్యె సంభ్రమభరతుఁడగుచు
నబ్జగర్భగురుండు పీతాంబరుండు, శ్రీమహీనీళల మును పరించినట్లు. 292

క. ఆలితఘర్మ పరతనా, శాతోదరులందు రామజనపాలుఁడు వి
ఖ్యాతిగ వక్షణనాయక, రీతి మెలఁగి వినుతిఁదా ధరిత్రినిఁగాంచెన్. 293

తే. ఆయమూద్వహుదేవులయందు మిగులఁ, గాంతుననురక్తిఁగనుభోజకన్యపగిది
రామభూపాలుసతులలో రమణుమన్న, నలను లక్ష్మాంబ మిక్కిలియలరుచుండు.

శా. ఆరామక్షితిభర్తగాంచెను బ్రమోదాయత్తుఁడై కొండమాం
బారామామణివల్లఁగొండధరణీపాలేంద్రు సద్వర్తనుం
డారామారిపురీశుఁదిమ్మవిభు లక్ష్మాంబాపయోజాస్యయం
దారూఢాత్ము సిరంగరాజవసుధాధ్యక్షున్దయాబ్ధ్యాత్మునిన్. 295

తే. ఈవిధంబునఁదిరుమలదేవి కొండ, మాంబ లక్ష్మమ్మయనుదేవులందు రామ
ధరణిపతిగాంచె సుతుల నేవురను వార, లలరిరీశునిపంచాస్యములనుబోలి. 296

క. వితరణరేఖను రాధా, సుతుఁడంచితభోగగరిమ సుత్రాముఁడనన్
నుతిఁగాంచెఁగృష్ణరాయ, క్షితివరుదౌహిత్రుఁడైనకృష్ణేంద్రుఁడిలన్ 297

క. కృష్ణమహీపతి రెండవ, కృష్ణుఁడు విమతబలహననకీర్తిని సాక్షా
త్కృష్ణుఁడు సతోషణన, తృష్ణకిరణసదృశుఁడెన్నుసురు తేజమునన్. 298

మ. హరిశౌర్యుండగురామరాజవిభుకృష్ణాధీశుసత్కీర్తియా
సురనాథేభము వెంటఁగొట్టి జలజస్తోమంబులంగట్టి భా
సురముక్తామణికాంతిఁదట్టి తుహినక్షోణీధ్రము న్మెట్టి తా
నురిఁబొమ్మంచను బొమ్మఁబెట్టుఁగరఁచున్నక్షీరవారాశులన్. 299

ఉ. ధైర్యుఁడు రామరాజపెదతిమ్మవిభుండని వాజిఁదోలి లోఁ
బాయనిభీతిచేత మొన భగ్నముగా యవనుల్దొలంగనా
చాయ నిజాముఁడడ్డపడ సామజయూథముఁదుంచెఁజూపరుల్
వాయుజుఁడంచునెంచఁగనవార్యసముజ్జ్వలబాహుశౌర్యుఁడై. 300

క. పెదతిమ్మనృపతి మఱియును, మదకరిహరివీరభటసమాజముతోడన్
గదనమునఁగదియుతురకల, సదమదముగఁగునిమె బాహుసంరంభమునన్. 301

ఉ. రాయకులీనుఁడైనయళిరామనృపాలుని పెద్దతిమ్మభూ
నాయకమౌళి యిచ్చు దిననాథతనూభవుమాడ్కి నర్థికిన్
ద్రోయక కోరుకోరికలు తూర్ణముగాఁగడుఁగీర్తిచంద్రికల్
దోయజసంభవాండమునఁదోరములై కనుపట్టుచుండఁగన్. 302

ఉ. మావులు నేనుఁగుల్భటసమాజము పీనుఁగుపెంటగాఁగ గం
గావలినుండి కృష్ణదనుకానొనరించి నిజాముఁదోలి రా
మావనినాథుఁగొండవిభుఁడాహవకేళిఁజరించెఁజూచియా
దేవతలెల్లనిఘనుఁడు దేవవరాత్మజుఁడంచునెంచఁగన్. 303

ఉ. సారదయావిశిష్టగుణసన్నుతరామనృపాలుకొండధా
త్రీరమణోగ్రఖడ్గహతిఁ ద్రెళ్లి తురుష్కవిభుల్చరింతురి
చ్ఛారతినొక్కటొక్కటె వశంబు పడైదుగురట్లు దేవతా
చారుమృగీవిలోచనలసంగతి నైజగుణంబెయౌఁగదా. 304

ఉ. ఏలుచునానెగొందిపురమింద్రసమానుఁడు కొండధారుణీ
పాలుఁడు పొల్చె శాత్రవులు బంటుతనంబుల మాని చావడిన్
వేళ యెఱింగి కాంచి మఱి వేళమునన్మకుటాగ్రరత్నరు
గ్జాలముచేత నాత్మపదకంజయుగంబునలంకరింపఁగన్. 305

క. సూరపవాహాధీశ్వరు, కూరిమిసుతఁదిరుపులాంబఁగులసతిగ మహో
దారత వరించె రాము, త్మారపుణునికొండనృపతి కడు వేడుకతోన్. 306

క. ఆమహితాత్మునితనయుఁడు, రామాధిపుఁడహితకమలరాకాశశియై
భూమిఁబ్రజలెప్పుడునధిక, శ్రీమించఁగనేలె నీతి చెలువుదలిర్పన్. 307

క. సారిభక్తిపరుఁడు సుగుణా, కరుఁడంచితదానవిజితకర్ణుఁడు రజనీ
కరకులుఁడు కొండధాత్రీ, శ్వరరామనృపాలుఁడిలను జననులినలరన్. 308

సీ. గొబ్బూరికులవార్ధికుముదాప్తుఁడౌనోబవిశ్వంభరాధీశవిభునికూర్మి
తనయయౌనరసింగమను సూరపాన్వయపావనుండగునోబపార్థివేంద్రు
పుత్త్రి నోబమ్మనుబోచిరాట్చన్ననృపాగ్రణ్యునిసుత జానకమ్మనిట్లు
పరుసతో ముగ్వురఁబరిణయంబై వారలనిశంబునసురక్తినాత్మధర్మ
తే. వర్తనను సహాయులై వర్తిలంగ, నఖిలతరభోగభాగ్యంబులాసతిత్ర
యంబుతోఁగూడఁ దాఁజాలననుభవించె,రామభూవరుకొండ్రాజు రామరాజు. 309

క. రామారితిమ్మవిభుఁడు క, రామారిని రిపులఁగనుమ రంజిలు శుభసం
సూచకములుదోస్తోడ సు, గీవయమునకును బ్రమోదస్ఫూర్తిదలిర్పన్. 310

ఉ. నారద వింటివె చిత్రమిది నారకవాసులుగాక దేవతా
వారిజగంధులంగలసి వత్తురు నన్గొలువంగ ధేనుసం
హారులు మ్లేచ్ఛులన్న వినుమా సురవల్లభయాజిభూమి రా
మారిపురీశుతిమ్మవిభునుగ్రకరాసిని మగ్గఁగాఁజుమీ. 311

చ. అన సురలెల్ల సంశయమె యబ్జజసంభవుమాట తథ్యమా
ఘనుకరవాలచిత్రగతిఁగంటిమిగాదె నిజాముసేనలన్

దుని మెడివేళ నాశ్వికునితోఁ దురగంబును మాపటీనితో
డనుగరి ఖడ్గయుక్తము భటప్రకరంబును డోల్ల వాసవా. 312

చ. అనఘుఁడు రామభూవరుప్రియాత్మజుఁడాచినతిమ్మమానవేం
ద్రుని పటుశౌర్యమాశశివిరోచనభూధరతారకంబుగా
దినదినముం బ్రియంబునను దీవనలిచ్చిరియెల్లదేవతల్
ఘనముగఁ బూలవాన జడిగాఁ గురియించిరియాడిరచ్చరల్. 313

ఉ. భూరిపరాక్రమోజ్జ్వలుఁడు పుణ్యచరిత్రుఁడు రామరాజు రా
మారిపురీశుతిమ్మనృపసోముని నిర్మలచారుకీర్తితో
సారెను సాటిరాఁ బెనఁగి చాలక కాదె జడద్ధరించి గా
రీరమణుండు గప్పెను ధరిత్రి యెఱుంగఁగ వ్యాఘ్రచర్మమున్. 314

క. రామారితిమ్మరాజఘ,రాచక్రేశ్వరుఁడు పాపరాజుప్రియసుతా
పోచమదేవిని మోద, ప్రాచుర్యము మదిఁ దలిర్పఁ బరిణయమయ్యెన్. 315

క. వీరాగ్రణి శ్రీరంగధ,రారమణుఁడు నదుల సాగరము లోఁగొనున
ట్లారూఢి రిపులఁ బోరిఁగొని, వారలసంపదలఁ గొనియె వాఱని వేడ్కన్. 316

చ. అతిశయదానలోలుఁడు మహామహుఁ డాశ్రితవజ్రపంజరుం
డతులితధర్మమార్గుఁ డభియాతిభయంకరమూర్తియార్యస
మ్మతమతి రామభూవరకుమారకుఁడైన సిరంగరాజుతో
క్షితివరులెవ్వరీడతనికిన్మఱి సాటియతండెయా మహిన్. 317

శా. దక్షధ్వంసియు రామరాజమనుజాధ్యక్షేశు శ్రీరంగరా
జక్షోణీంద్రుఁడు నొక్కమాపరయనీ సర్వంసహామ్నాధుసం
రక్షన్ శత్రుపురీహరత్వమున శౌర్యస్ఫూర్తినట్లయ్యు య
జ్ఞక్షోభోగ్రుఁడతండితండు మఘురత్నాదత్తుఁ డీక్షింపఁగన్. 318

మ. పరమప్రీతి వినమ్రులై సకలభూపాలుర్ధనంగొల్వఁగాఁ
గరుణాంభోనిధి రామభూవరుసిరంగక్ష్మాతలాధీశుఁడు
ర్వరఁ బాలించె భగీరథున్నగరునిన్ రాముం ద్రిశంకూద్భవున్
బురుకుత్సున్నహుషుం బకీషు భరతున్ బూరున్నలుం బోలుచున్. 319

మ. అళిరామేంద్రసిరంగరాయమనుజాధ్యక్షేశుసత్కీర్తి ని
ర్మలకాంతుల్నిబిడంబుగాఁ గలుషుఁ బర్వం జూడఁ జెన్నొంగెనే

జలజాతప్రభవాండభాండము మహాశ్చర్యంబు సంధిల్లఁగాఁ
బొలుపొందంగ వివర్ణనీయమయి కర్పూరంపుబొట్టోయనన్. 320

తే. బాహుబలభీమ సంగ్రామపరశురామ, రామభూవర శ్రీరంగరాయవిభుని
భూరితేజోఽరుణద్యుతి భువనములరేఁ, బుష్పితాశోకభూరుహచ్ఛ్రీఁ దనరి.

చ. కడిమిఁ గిరీటిమాడ్కి నుతిఁగన్న సిరంగమహీవిభుండు మే
ల్కడకలపోచిరాజరఘునాథనృపాలునికూర్మిపుత్త్రికన్
బుడమిపడంతిదాల్మినను బోలినలక్ష్మమనున్వరించెనిం
పడరఁగ రాఘవుండు జనకాత్మజఁ గైకొనుచంద మేర్పడన్. 322

సీ. అనవరతాభ్యుదయాభిలాషాశ్రితప్రతతికి ముంగొంగుపసిఁడియనఁగ
వినుతవిద్వత్కవివిసరంబులకు గృహస్థితయైనయా కామధేనువనఁగ
వంశానుగుణ్యప్రవర్తనులౌ బంధువితతిపాలిటికల్పలతికయనఁగ
సరసాన్నదానదీక్షామహానిపుణత్వమునను రెండవయన్నపూర్ణయనఁగఁ

తే. జతురుదధివేష్టితావనీచక్రమునను, గలుగుసర్వసర్వంసహాతలవరేణ్య
కామినీజనసన్నుతుల్గాంచి మిగులఁ, దేజరిల్లి నలక్ష్మమ్మదేవివలన. 323

క. అతిగుణనిధి శ్రీరంగ, క్షితిపతికుదయించిరార్యకీర్తితసుగుణా
న్వితులు సుతులు పెదవేంకట, పతి చినవేంకటపతియనఁబరఁగనిరువురున్. 324

మ. అరిభూపాలకులాజి నిక్కముగ జాయార్థంబు సక్రోధుఁడై
శరధిం గట్టి కపర్ది నాఁగఁ బురముల్ శౌర్యోన్నతిన్ర్పుంచుదా
శరథిం గా మది నెంచి కాన్కలిడి యాజ్ఞావర్తులై కొల్తురా
కరుణాంభోనిధిఁ బెద్ద వేంకటపతిక్ష్మాపాలు నెల్లప్పుడున్. 325

శా. శ్రీరంగాధిపు పెద్దవేంకటధరిత్రీజాని యుద్యద్భుజా
సారంబొప్పఁగ నేలె నెంతయునుగృష్ణా సేతుమధ్యక్షితిన్
దూరీభూతవిపత్సమానవవరస్తోమప్రచారంబుగా
నారూఢిన్ధరణీజనుల్సకలసౌఖ్యావాప్తి రాణింపఁగన్. 326

సీ. వనజనివాసానివాసకృపారసాసారాలవాలవీక్షణము చేత
శరసుధామందారశరదభ్రడిండీరధవళసత్కీర్తిసంతతుల చేత
నలజయంతవసంతనలకూబరనితాంతవరరూపకలితవిస్ఫురణ చేత
రణరంగచండదోర్బలదుర్జయాహితగణగర్వహరణవిక్రమము చేతఁ

తే. బుండరీకాక్షుఁ దద్భాగ్రితఁ బుత్త్రమిత్త్రుఁ, దెగడి ప్రహసించియుఁ జికించి ధిక్కరించి

మించె నెంతయు శ్రీరంగమేదినీశు, పెద్దవేంకటపతిరాయభిదురపాణి. 327

క. గొబ్బూరివంశమణి హ, న్నిబ్బరగండఁడగు నోబనృపవరుసుతయౌ
నబ్బంగారమ్మను మది, నుబ్బుచుఁ బెదవేంకటపతియొనర వరించెన్. 328

క. అతనిసహోదరుఁ డబ్జా, హితకులకలశాబ్ధిపూర్ణహిమరుచి బుధస
న్నుతమతియౌ చినవేంకట, పతిగుణతతి నుతికలవియె ఫణిపతికైనన్. 329

తే. భక్తజనమందిరాంగణపారిజాత, మైన శ్రీవేంకటాచలాధ్యక్షుపగిది
భవ్యసాత్త్వికగుణగణభ్రాజియగుచుఁ, జిన్నవేంకటపతిరాజసింహుఁ డలరు. 330

సీ. పెనుబాఁపకవణంబుఁ దినువారువము రౌతుపట్టి సోయగముతోఁ బరఁగువాఁడు
కలిమిచూపుమిటారికత్తియతోఁ బుట్టుపసమించు రంగుతో నెసఁగువాఁడు
తపసిరాకన్నాఁపదాలుపుచెలికానిదళమైనయీవితోఁ దనరువాఁడు
తాటిపెక్కమువానితల్లి నెయ్యపుఁబట్టి మించుబీరంబుతో మెఱయువాఁడు

తే. రాజమాత్రుండె శ్రీరంగరాజుచిన్న, వేంకటపతీశుఁ డఖిలపృథ్వీపతీంద్ర
మకుటమణిఘృణిసువిరాజమానపాద, పద్ముఁ డాశ్రితజనపద్మభాస్కరుండు. 331

సీ. మొగమియ్యకను బరాఙ్ముఖుఁడైనఁ గదియఁబోకను జిరాయువు గల్గఁగా నొనర్చుఁ
గని కరమ్ములు మోడ్చఁగ నికరమ్మునఁ బ్రోచి ముదముతో సకలసంపదలఁ గూర్చుఁ
గలసియుండకను జపలమతి నాగవాసముఁ జేర నిజవధూజనులఁ జేర్చు
నెదురుగా రాఁ గ్రుచ్చి రొత్తి వేగమె వేల్పుపొలఁతులపాలిండ్లఁ బొందఁ దార్చు

తే. నతులవీరప్రతాపరాజాధిరాజ, రాజపరమేశబిరుదవిరాజమానుఁ
డైన చినవేంకటేంద్రుబాహాసిపుత్త్రి, చిత్రమిదియని బుధులు చర్చింతు రెపుడు.

సీ. ఒకనాఁడు చినవేంకటోర్వీశ్వరుఁడు విరూపాక్షసేవాసక్తి నచ్చటికిని
నరిగి క్రమ్మఁ ద్రోవయందొక్కరెయుడ రామసుత్రాముఁడును బొడచూపినట్లు
తోఁచిన భయము సంతోషంబుఁ బెనఁగొనఁ బ్రకటరోమాంచకంచుకితగాత్రుఁ
డై వచ్చి నెమ్మది హరిఁ దల్చి నిస్త్రింశ పంజైనమణికిరీటంబుఁ దాల్చి

ఆ. దివ్యభూషణములు దివ్యమాల్యంబులు, దివ్యగంధములును దివ్యవస్త్ర
ములును దాల్చి దివ్యమూర్తితోఁ గోదండ, పాణియైన రామభద్రుఁ డెపుడు. 333

క. వచ్చుటయు నిల్చినఁ గనుఁగొని, యచ్చెరువీ రాజచటికి నరుదెంచుటయే
మిచ్చను దలఁచుక నోయది, యొచ్చెముపడనీక దానినొనఁగూర్పఁదగున్. 334

సీ. అనుచు నుడువఁ బోయునంత నోఁ చినవేంకటాధిప నీవు సంపాదితాఘుఁ
డగునీశు భజియించి యరుదేరఁ బ్రోవను బొడసూపినట్టి యాభూమిభుజుఁడ

నేను నా పేరు నీకెఱిఁగింతుఁ గోదండపాణియా శ్రీరామభద్రుఁ డండ్రు
మమ్ము భూజనులన్నమాట విన్నంతన నిటలతటాగ్రసంఘటితహస్త
తే. కమలుఁడై దండములఁ బెట్టి కనకపీఠ, మందు నాసీనుఁ గాఁ జేసి యాగమోక్త
సరణిఁ బూజించి తత్పాదజలజములకు, భక్తిఁ బ్రణమిల్లి యిట్లని ప్రణుతిఁ జేసె 335

## చక్రబంధము.

శా. భవ్యా కోసలసూతినందన రమాభావేందుసారంగకా
క్రవ్యాదప్రహరప్రవీణ నయరక్షాగణ్యనామాంకితా
దివ్యాండప్రచయప్రభావనరథా దీనస్పృహాకంటకా
కావ్యారంభహితక్రమా విదితనాకారిశ్రితానందకా. 336

## నాగబంధము.

చ. పరమదయాకరా రవిజభంజన బోధవిహారభాసురా
కరధృతచాప నీరజజకంజసురప్రకరాశనాంబుజా
మరధరణీజహీరశరమారవిపక్షపయోదసారకీ
ర్తిరమశతావిహార ధరధీర వసువ్రజభూతపావకా. 337

## గోమూత్రికాబంధము.

క. మురహర ధృతగిరివర పర, వరద రమాధీశ గోప వర్ణితచరణా
దరధర నుత కరివర సుర, వరద రసాధీన గోప వందితచరణా. 338

## చతుశ్చరణగర్భకందము.

గిరిధర కమలాధ్యక్షా, సరసీరుహపత్రనయన శరనిధిశయనా
మురహర సన్నుతనామా, కరుణాకర నరసఖ హరి కరివరరక్షా. 339
1. శరనిధిశయనా మురహర, సరసీరుహపత్రనయన సన్నుతనామా
కరివరరక్షా గిరిధర, కరుణాకర నరసఖ హరి కమలాధ్యక్షా. 340
2. శరనిధిశయనా గిరిధర, సరసీరుహపత్రనయన సన్నుతనామా
కరివరరక్షా కరుణా, కర నరసఖ హరి మురహర కమలాధ్యక్షా. 341

## ద్వికందగర్భక్రౌంచపదవృత్తము.

ధారుణిపారావారసుతారత్నములిరుగడల సతతము నుబాదాం
భోరుహసేవల్గూరిమిఁ బూరంబుగ నెదలనునిచి పొలుపుగఁ జేయన్
జేరి సురస్తైవారముచే రంజిలునటులొనరిచి చెలఁగఁగ నుండే
వారిదవర్ణున్ శౌరిని వైరివ్రజదమను జగదవనునినిఁ గొల్తున్. 342

క. ధారుణిపారావారసు, తారత్నములిరుగడల సతతమునుబాడాం
భోరుహసేవల్గూరిమిఁ, బూరంబుగ నెదలనునిచి పొలుపుగఁజేయుఙ్. 343

క. చేరి సురద్గైవారము,చే రంజిలునటులొనరిచి చెలఁగఁగనుండే
వారిదవర్ణుఙ్ శౌరిని, వైరివ్రజదమను జగదవనునినిగొల్తుఙ్. 344

నవగ్రహాష్టదిక్పాలకదశావతారనామగర్భకందము.

హరి శశి కుజ బుధ గురు కవి, హరిసుత తమకేతు హరియమాస్రపకధనే
శ్వరశంకర శరచరయుగ, కిరి నరహరి నటు త్రిరామ కితవ ముఖహరా. 345

దండకము.

శ్రీజానకీనిస్తులోరోజ కాశ్మీరకస్తూరికాగంధపంకాంకితోరస్థలా,నిర్జరారాతి సంఘాటవీదాహదావానలా, కోటిసూర్యప్రకాశా, త్రిలోకేశ, విశ్వస్వరూపా, శుభాలాప, గోరాజహంసాభ్రమాతంగవాహాదిగీర్వాణసందోహకోటీరకోటిస్ఫుటానర్ఘ్యరత్నప్రభాకీర్ణపాదారవిందా, సునాభీసరోజాతగర్భార్భకాకారరాజచ్ఛతానంద, గౌరీశవాగీశనాకేశభోగీశులైనఙ్ భవద్దివ్యచారిత్రముల్సన్నుతుల్సేయఁగాఁజాలరే నెంతవాఁడఙ్ మహామూఢచిత్తుండ మత్తుండనైనఙ్ భవత్కృత్యముల్సన్నుతుల్సెదంజిత్తమందుంచి రక్షింపవే, దేవ, మీనాకృతిందాల్చి, సుప్తాబ్జసంజాతనిశ్వాసవేదాపహర్తాసురారాతి మర్దించి యాబ్రహ్మకున్వేదముల్గ్రమ్మఱంజేర్పవే, కచ్ఛపాకారముంబూని పాథోధినిర్మగ్నమంథాచలేంద్రంబు వెన్నాఁగి దూర్వాసశాపాహతాఖండలశ్రీపునర్భావముంజేయవే, ఘృష్టిరూపంబుచేఁజండబాహాబలోదగ్రహేమాక్షరక్షఃగపతింద్రుంచి పాథోనిమజ్జద్ధరాకాంతనత్యంతసంతోషితస్వాంతగాఁజేసి శృంగాగ్రభాగంబునన్నిల్పవే, మర్త్యసింహుండనై స్తంభమందుద్భవంబంది సాయంసమారంభకాలంబునందూరుయుగ్మస్థలాసాదితాదిత్యవిద్వేషిరాట్కుక్షివిచ్ఛేదనోత్సాహముంజూపి నీబంటుసంతంబుఁ జెల్లింపవే, గుజ్జుపాటుండవై నిర్జితామర్త్యనాథప్రకర్షానుమోదాత్ముఁడైనట్టివైరోచనిన్మట్టి జిష్ణేంద్రరాజ్యప్రతిష్ఠాపనాచార్యవిఖ్యాతినింజెందవే, రేణుకాగర్భపేటీలసద్రత్నరామావతారంబుచే సాపరాధాతిశౌర్యోగ్రరాజన్యహస్తోరుదోర్దుష్టఖ్యాంజన్య సందోహముంజెండి సర్వంసహాచక్రమాద్యంతముంగశ్యపబ్రహ్మకుం దానరూపంబుగా నీయవే, రామభద్రాఖ్యచే గాధిపుత్రుండు గావించుయాగావనార్థంబు వేంచేసి యాతాటకానామఘోషాచరిం బుత్రయుక్తంబుగాఁద్రుంచి మారీచుని న్వారధిన్ముంచి పాషాణరూపంబుచేనున్నమౌనీంద్రుయోషాలలామంబు దోషంబులెల్లన్ని

వేషంబులో నంఘ్రిరేణుప్రభావంబుచేతం దొలంగించి చంచద్గుణోపేతకై లోక
విఖ్యాతకై విస్ఫురద్భాగ్యసంఘాతకై సీతకై దర్పకారాతికోదండదండంబు వేదం
డ మంభోజకాండంబు ఖండించుచందంబునం ద్రుంచి భూపుత్రి నిన్వేడ్కతోఁ
బెండ్లియై చాల దోశ్చండగర్వాతిరేకోన్నతిన్మించు నాజామదగ్న్యున్నివారించి
యాకేకయీశాత్మజామోదమౌనట్టుగాఁ దండ్రిసత్యంబుఁ బాలించి రాజ్యాభి
లాషంబుఁ జాలించి ఘోరాపరాధున్విరాధుంబడంగూల్చి నానామృగాకీర్ణమౌ దండ
కారణ్యభూమిం బ్రవేశించి మౌనీంద్రవిద్వేషణుందూషణుం ద్రుంచి మాయా
కురంగాకృతౌ నీచు మారీచు ఖండించి పాదోరుసంఘట్టనక్షుణ్ణనానావిధగ్రావు
సుగ్రీవునింబంటుగా నేలి సంగ్రామరంగస్థలీజృంభణోద్యద్భుజాశాలి నావాలినా
క్రమ్మునంగూలఁగా నేసి బాణాగ్నికీలంబయోరాశినింకించి భాస్వద్యశోహేతువౌ
సేతువుంగట్టి నిశ్శంక లంకాపురింజుట్టి మాయావులున్యుద్ధచాతుర్యసంపన్నులున్ గ
ర్వదుర్వారులున్ దేవతావ్రాతసంహారులు నైనయాకంపకర్ణాదిరాత్రించరాధీ
శులం ద్రుంచి యాఖండలస్యందనంబెక్కి దుర్వారగర్వోన్నతిన్ లోకవిద్రా
వణున్ రావణున్ గూల్చి లంకాపురాధీశుఁగాఁ గుంభకర్ణానుజుంబట్టముంగట్టి
వైశ్వానరాభీలకీలాప్రవేశక్రియాత్యంతశుద్ధాత్మయైనట్టి ధాత్రీసుతన్వేడ్కఁ జే
పట్టి రాత్రించరుల్వానరుల్గొల్వఁగాఁ బుష్పకంబెక్కి యక్కైకయీనందనాలం
కృతంబౌనయోధ్యాపురంబుం బ్రవేశించి కౌసల్యకుం గైకకున్ శ్రీసుమిత్రామహా
దేవికిన్ భక్తితో దండముల్వెట్టి మిత్రానుజాచార్యసామంతమంత్రిక్షమానాయ
కుల్సంతసంబందఁబట్టాభిషిక్తుండవై సీతతోఁగూడ సౌభాగ్యభోగాభివృద్ధిం బ్రవ
ర్ధిల్లవే, రోహిణీపుత్రరామస్వరూపంబుచే లాంగలోద్ధూతనాగాధిభూపట్టణాకా
రరేఖన్విజృంభించి భీతాత్మఁడౌకారవేంద్రుం గృపం బ్రోవవే, బుద్ధభావంబుచే నా
సురీమానభంగంబుఁ గావించి ఫాలాక్షునింద్రాదిబృందారకానీకసంస్తుత్యశశ్వజ్జయ
శ్రీ నరింపన్నియోగింపవే, కల్కివై గర్హమార్గేతరోర్వీజనవ్రాతముం ద్రుంచియు
త్పన్నవర్ణాశ్రమాచారసద్వర్తనోద్ధారకత్వంబునం బొల్చునాహ్లాదభావాప్రమేయుం
డవౌనట్టిదేవుండవున్నీవకావే, త్రిలోకంబులన్ లీలఁ బుట్టింప రక్షింప సంహారముం
జేయఁగాఁ జాలియున్నట్టి మూర్తిత్రయాకారసంభూతిహేతు స్వయంవ్యక్తమా
యాపరబ్రహ్మము న్నీవకావే, భుజంగేంద్రతల్పా, ప్రపన్నాఖిలాషద్వరానల్ప
కల్పా, భవద్భక్తి నాకుం బ్రసాదించి రక్షింపవే, భానువంశాబ్ధిరాకాసుధాధామ,
దైత్యేంద్రహృద్భీమ, నీలాంబుదశ్యామ, కోదండరామా, నమస్తే నమస్తే
నమస్తే నమః. 346

తే. అనుచు వినుతింపనారాముఁడనియెఁ జిన్న, వేంకటపతిక్షమానాథ వినుము నీదు
పుత్త్రుఁడగువీరవేంకటభూవరునకు, నగ్రసుతుఁడుద్భవిల్లు మదంశమునను. 347

క. అనియానతిచ్చి రాముఁడు, గనుఁగొననంతర్హితుండుగా మేల్కొనియా
చినవేంకటపతి పొంగిన, జనములకావిధముఁ దెలిపి సంతోషమునన్. 348

క. చినవేంకటపతినృపమణి, కనకప్రాకారముఖ్యకైంకర్యంబుల్
జనులెన్నఁగ మోదంబొ, ప్పనొనర్చి భజించె రామభద్రస్వామిన్. 349

ఉ. ఈమహిఁ జిన్నవేంకటపతీశ్వరుఁడర్థులఁ జెందఁ జేయు ము
క్తామితహారనాహమదహస్తి సువర్ణముఖోరుసంపదల్
ప్రేమను శత్రుకోటికిని భీషణరేఖనుగల్గఁ జేయు ము
క్తామితహారవాహమదహస్తిసువర్ణముఖోరుసంపదల్. 350

సీ. ఏధన్యునిజధామమిందిరాకాంతకు మానితకేళికామందిరంబు
ఏఘనుభుజపీఠమీమహీకామోదకరరమణీయసౌఖ్యప్రదంబు
ఏభూభుజునిజిహ్వ యాభారతికి నెప్డుఁగమనీయనృత్తరంగస్థలంబు
ఏకాంతుకరుణావిలోకనంబాశ్రితగురుజనములకు ముంగొంగుపసిఁడి
తే. యతఁడు సామాన్యుఁడే సగరాంబరీష, భరతనలరంతిహైహయప్రముఖపూర్వ
రాజచర్యుండు శ్రీరంగరాజచంద్రు, చిన్నవేంకటపతినృపశేఖరుండు. 351

సీ. జంటమొగంబులసామిముద్దులకుఱ్ఱతల్లిగేస్తుఁడు సిగఁదాల్చుపువ్వు
వడిగలజింకతత్తడి నెక్కునెలరాతుపాఱుగుఱ్ఱిదొరకును బొరుగుఱేని
నిరునాలుమేనులునెసఁగు వేలుపుతండ్రిపట్టిపట్టిపులు బలుసంజమొకముఁ
దనబిడ్డనునుజూపులనుగాచుకొనుడాలుగలమేటితల్లినిఁ గన్నవాని
తే. నక్కఁ జెలఁచియునక్కాఁగి చెక్కలడఁచి, కలఁచి నీరుగఁ జేసి నక్కడలయందుఁ
గడిమి నెంతయుఁ జెలఁగుచుఁ గలయ మెలఁగ, యుబ్బుఁ జిన్నవేంకటపతిగబ్బియసము.

క. చినవేంకటపతినరవరు, ఘననిర్మలతేజమలరుఁ గర్ణాటమహీ
వనజాయతాక్షి మైఁబూ, సినయభినవసంకుమంబు చెలువుదలిర్పన్. 353

మ. పరమప్రీతి జిలెల్లనారపమహాసాతేనుసత్పుత్త్రుఁడా
మరసాక్షిందిరువెంగళాంబనరసంహాగ్రైకశూరుండు భూ
సురధైర్యుండగుచిన్నవేంకటపతిక్షోణీంద్రుఁడు ద్వాహము
ర్యొవ్వరనున్నన్నగరాజతల్పుఁడు వివాహంబైనచందంబునన్. 354

క. మతిచేఁగమనీయతరా, కృతిచేఁబతిభక్తిచేనొగిందగనాభా

రతికిన్ రతికిని సతికిని, నతిశయమయినతిరువెంగళాంబికయందున్. 355

మ. జననంబందిరి చిన్నవేంకటమహీశస్వామికిన్నందనుల్
ఘనచారిత్రుఁడు తిర్మలాధిపుఁడు సంగ్రామాప్తనుండంచు భూ
జనసంస్తుత్యతఁగాంచువేంకటపతిక్ష్మాజానియున్ధర్మవ
ర్తన రాణించుసిరంగరాయమనుజాధ్యక్షుఁడన్ము వ్వురున్. 356

క. కృతిమెఱుఁగుటయరిశరణన, హితమతి మనుచుట కవీంద్రులేమడిగిన స
మ్మతినిచ్చుట చినవేంకట, పతితిరుమలనృపతికెపుడుఁబాయనిగుణముల్. 357

సీ. గోపాలమూర్తియాగోపాలభూపాలచంద్రుఁడు దనదురాజ్యంబునకును
బట్టంబుఁగట్టిన బాహాబలస్ఫూర్తి మెఱసి ధర్మంబున ధరణి నేలి
వర్ణాశ్రమంబులు వరుసతో నడపుచు నీతిబాధలులేక ప్రీతి జనులు
సంపదలనుదేల సవనోత్సవంబులు దఱుచుగానూపూర జఱుగుచుండ

తే. సకలనరనాయకులుగనుసన్నమెలఁగఁ, దనకు వేలూరు నిజరాజధాని గాఁగఁ
బరఁగెఁగడుఁజిన్నవేంకటపతికుమార, రత్నమైనట్టి శ్రీరంగరాయమౌళి. 358

క. దిమ్మరివైరులఁబోరిగొని, కొమ్మనుచునుబసిఁడి వేలకొలఁదులుగా ని
త్యమ్మునుగవులకునొసఁగుట, నిమ్మగు శ్రీరంగమానవేంద్రునిగుణముల్. 359

సీ. ధాటీనిరాఘాటఘోటకోద్ధుతపాంసుపటలంబు నల్గడఁబాఱఁజల్లి
బంధురతరగంధసింధురనికరశీకరము నిబ్బరముగఁజిలికి చిలికి
వితతదోర్బలవిజృంభితయోధశరసరశంకాహతులఁజాల బెండుపఱచి
వీరరసావేశఘోరసద్భటభేదఘట్టనలనుజాపముట్టువెట్టి

తే. యుదయగిరిదంతపెలుఁగొండుచుండుకుతువ,శాహుబలదర్ప దనహుతాశనునినడఁచి
వినుతిఁగాంచెను సకలభూజనులచేల, రమ్యగుణహారి శ్రీరంగరాయశౌరి. 360

సీ. మామమామగువానిమామనుగన్నయమ్మకుమారిమిమనుమనికొడుకుకొడుకు
కొండలనొరపట్టి కొడుకు తేజీ మేఁత మేఁతమావలగువానిమేటితాత
తోలుఁబలుఁగుతన్నలఁదోలెడునాతనిమనుమనిమనుమనిపగతుసుతుఁడు
బిడ్డగేస్తునితండ్రిబిడ్డనిమామన్నకొడుకునుకూడఁజినకడిఁదిమగఁడు

తే. దానగుణమున వితతప్రతాపమునను, జక్కఁదనమునసహాయసాహసమున
సాటియగుఁగాకయితరులు సాటిరెటులఁ, జేయఁగావచ్చు శ్రీరంగరాయమణికి.

క. శ్రీరంగరాయనకి గొబ్బూరివంశజైన నెంగళోర్వీశుతనూ
జారత్నముఁబొందిస్మన, సాదవిభవమలరఁగా వివాహంబయ్యెన్. 362

సీ. మఱి పోచిరాట్కులమండనుండగు వెంగభూనాయకాగ్రణిపుత్త్రియైన
రాఘువమ్మను బోచిరాజువేంకటరాజతనయ వెంగమ్మనుద్వాహమయ్యె
నాసతీత్రయమునననురక్తితో సర్వధర్మసహాయమై తగ భజింప
నతిశయభోగభాగ్యాభివృద్ధినిఁ జాల రాణించి ధర్మమార్గప్రచారి
తే. యనుచు విద్వజ్జనంబులు వినుతిసేయ, వెలసె నెంతయునసహాయవిక్రమాఢ్యుఁ
డారవీటిపురాధీశుఁడైన చిన్న, వేంకటపతీంద్రు శ్రీరంగవిభుఁడు మిగుల. 363

సీ. దరముతోఁ జీనికప్పురముతో ఘనశశకంధరముతోఁ జోడుగాఁ దనర మెలఁగి
శరముతోఁ దుహినభూధరముతో బుక్కవిసరముతోఁ బ్రతియనఁ జాల మెఱసి
హారములతో ముత్యపుసరులతో దైవతతరులతో ననురక్తిఁ దగ నొనర్చి
రాజుతో నింద్రేభరాజుతోఁ బన్నగరాజుతో నెనయగు రంగుఁ బూని
తే. దశదిశాత్యంతపరిపూర్ణతను వహించి, రహిని వెలసెను శ్రీరంగరాయమౌళి
ధాళధళ్యప్రభామయ ఘనవిశకీర్తి, కవిజనాధీశవర్ణనగడుఁ జెలంగ. 364

క. ఇట్టిగుణంబులుఁ గలతోఁ, బుట్టువులనురక్తిఁ గొలువఁ బోరుల రిపులన్
గొట్టి మనుమార్గచర్యకుఁ, బట్టగుచును వేంకటేశపార్థివుఁ డలరున్. 365

చ. కుటిలవిరోధిరాజమదకుంజరసింహకిశోరమూర్తి వి
స్ఫుటహరిభక్తితత్పరుఁడు పూరుకులీనుఁడు ధర్మవేది వేం
కటపతిరాయశేఖరుఁ డగణ్యగుణాకరుఁ డమ్మహాత్మునిం
బటుమతియౌ బృహస్పతికిఁ బన్నగభర్తకు నెన్న శక్యమే. 366

సీ. తా భుజింపఁగలేక తళిగ వడ్డించినయన్నంబు సతతంబు నమ్ముకొనుట
పారి బీదతనమున నొరులకుఁ దన సొమ్ము పుడకమాత్రంబైనఁ బోరయనీక
యొకటికి రెండుగా నొగి వడ్డి రాఁబట్టి ధనమెల్ల మూలను దాఁచుకొనుట
తనుఁ జూడవచ్చినఁ గనికరంబును లేక కలసొమ్ములెల్లను గిలుబుకొనుట
తే. మానెనేనియు నెనవచ్చు మానితోన్న, దానవితరణభోగప్రజానురంజ
నపరుఁడై నట్టిచిన వేంకటపతి వేంక, టపతికిని నల శ్రీవేంకటపతి యరయ. 367

చ. జలరుహబాంధవాత్మజుఁ డొసంగును రేఁపటి పూటభక్తితో
గలుపలరాయఁ డిచ్చు నొడికంబుగ మాఁపటివేళ వేడ్కచే
నెలమి నొసంగు వేంకటపతీంద్రుఁడు రేఁపును మాఁపునర్థిన
ర్థులకు సమస్తవస్తువులు దోరముగా ననివార్యదాతృతన్, 368

సీ. వైభవంబున నెనవచ్చును మఘవుఁ గుఱ్ఱో భీతి డాఁగకయున్న భిదురపాణి
సౌందర్యమునఁ గొంత సరియగుఁ బురహరుకనువెచ్చఁ గనకున్న మనసిజుండు
గాంభీర్యమున నీడు ఘనరాఘవాశుగాగ్రమున నీల్గక యున్నఁ గంధిరాజు
కాంతినిఁ బ్రతియగు మఖధ్వంసిపదహతిఁ గందుఁ జెందక యున్నఁ గమలవైరి
తే. యనుచుఁ జతురంబునిధివేష్టితావనీశ, సభలఁ గవిజననికరంబు లభినుతింప
నలరునార్వీటిపురవరాధ్యక్షుఁ డైన, రణజయవిహారి వేంకటరాయశౌరి. 369

చ. ఇననిభుఁ డైన వేంకటపతీశుఁడు దక్షిణబాహుపీఠి నిం
పెనయ వహింప భూభరమహీనపరాక్రమరేఖ మించె భూ
జనములు సర్వసంపదలఁ జాలఁ గఁ గల్గి సుఖింప నాగకూ
ర్మనగవరాహభోగులకు మానుగ నూఱట గల్గె నెంతయున్. 370

సీ. ఆగమోక్తసుదక్షిణాన్వితముగఁ జేయు సరవితో దశదశసవనములను
బర్వములను భూసుపర్వులకిచ్చు నుదఱుచుగా బహువిధదానములను
ఆరూఢిగాఁ గనూయూరను బెట్టించు ప్రపాసోపేతాన్నసత్రములను
గనకగోపురవప్రకలితంబుగా వేడ్కఁ గట్టించు దేవతాగారములను
తే. రాజమాత్రుండె ధరణీవరాహబిరుద, వినుతుఁ డాత్రేయగోత్రపవిత్రుఁ డాన
తారికోటీకరుగ్భ్రాజితాంఘ్రితామ, రసుఁడు వేంకటపతిరాయరాజమౌళి. 371

సీ. నెఱయాఁగి బలుఁ జెట్టునిగనిగల్లడు నవ్వి రిక్కలదొరరంగు స్రుక్కఁజేసి
జగడాలమునితేనిజిగిఁ గేరి వినువాఁక చాయలనిట్టునటుఁ బాయఁద్రోచి
పల్కుఁజిల్కలకొల్కి తళుక్కలగమి మించి యంచలమైసిరిఁ గొంచెపఱచి
తెరగంటియొకిమీని తేజిసొంపును గెల్చి పాపరాయని పసఁ బాఱఁదోలి
తే. ప్రొద్దుకడవెళ్ళఁ బూచునాపూవుతావి, కలుకుఁ బుట్టించి చాదంతి యనువుఁ దెగడి
కడిమి నలుగడలందు వేంకటపతీశు, నసము మిగుల మేలనఁగఁ జెన్నలరుచుండు. 372

ఉ. ఇమ్మహియందు వేంకటపతీంద్రునభోమణిసాటియౌ ప్రతా
పమ్మనివార్యతన్నెలఁగి బంధురమై నలుదిక్కులెల్లనుం
గ్రమ్మిన దుర్జయాహితధరావరులెల్లను భీతిచే దివాం
ధమ్ములఁ బోలి డాఁగిరి పదంబులఁ బొంగి గుహాంతరంబులన్. 373

సీ. రాజాధిరాజవీరప్రతాపాంకుఁడౌ వేంకటపతిరాయవిభుఁడు వేడ్క
నూరపక్ష్మాక్షి శోణీశుసత్పుత్రి నప్పలాంబను నమరాద్రిధైర్యుఁ
డనఘుండు పోచిరాజాన్వయుండగు రఘునాథరాజేంద్రునినందనలను
విమలసచ్చారిత్ర వెంగమ్మ పద్మాయతాక్షి కోనేటమ్మ యన నిరువుర

తే నొగి వరించెను సతులను ముగురియందు, నశ్వినియునాదియగుతారకాళిలో ర
మణుని యనురక్తిఁ గాంచు రోహిణివిధమున, నలరుఁబతిమన్ననలనప్పలాంబ మిగుల.

ఉ. అంబుధిరుద్ధభూస్థలిని నారసి చూచిన దీటు లేదుగా
యంబుదవేణులందు సుగుణావళిచేతను యానధూలికా
దంబకుఁ బోషితాశ్రితకదంబకు నాస్యనిరస్తశీతరు
గ్బింబకు భద్రదప్రథితకీర్తివిడంబకు నప్పలాంబకున్. 375

క. దీనులను బ్రోచు సరతను, నూనకృపారసనిగుంభితోజ్జ్వలమతియై
జానుగ నిల వేంకటపతి, భూనాథుని యప్పలాంబ బుధనుతు లెసఁగన్. 376

సీ. తాలిమిచే భూతధాత్రికిఁ బ్రతియిచ్చు వాగ్వైఖరిని సరస్వతికి హెచ్చు
సత్యవాక్ప్రౌఢిని సత్యభామను నీడు వైభవంబున నిందువనితఁ జోడు
మాంగళ్యమున సర్వమంగళకెనఁ జాలు భద్రసంపదఁ గల్మి పడఁతిఁ బోలు
నన్నదానంబున నన్నపూర్ణకు సాటి పతిభక్తి నరుంధతికిఁ బోఁటి
తే. యనఁగఁ బొగడొందు నుభయాన్వయంబులకును, వన్నెవాసియుఁ గలుగంగ వసుధ నార
వీటి వేంకటపతిపృథివీవరాప్తు, రాంశునర్ధాంగలక్ష్మి యానప్పలాంబ. 377

క. వారిరువురుగని రనఘుల, వీరాగ్రణి రామరాజవిభునిన్ శౌర్యో
దారుం డనఁదగు తిమ్మధ, రారమణుని వేంకటాద్రిరాజబిడౌజున్. 378

తే. ఘనతరాన్యోన్యమోదంబుగలుగ మెలఁగి, చెలఁగుచుండెడియారాజసింహవరుల
యన్నదమ్ముల సౌభ్రాత్రమభినుతింపఁ, జెలువరాయని కైనను నలవియవునె. 379

సీ. కమలాతనూభవాకారరేఖను బొల్చి సతులను మోహావసతులఁ జేయుఁ
గదనగాండీవివిఖ్యాతిని రాణించి పరులను సురవధూవరులఁ జేయు
దేవతాభూజవితీర్ణినిఁ దనరుచుఁ గవులసంపన్మహార్ఘులఁ జేయు
వినుతసద్ధర్మప్రవీణత్వమున మించి జనులను సన్మోదఘనులఁ జేయు
తే. ననుచు వినుతింతు రఖిలధరాధిపేంద్ర, సభల నెప్పుడు సత్కవీశ్వరులు వేడ్క
లలర నెంతయు నార్వీటికులపవిత్రుఁ, డైన వేంకటపతినృపాలాఢ్యు నెలమి. 380

సీ. ఘనధర్మసద్గుణకమనీయుఁ డగుటనో పలుకు రామామోఘబాణమయ్యె
వర్ణితమిత్రానువర్తనంబవుటనో పృథివీశరణమింపు రేఖయయ్యె
ఘోరారికర్ణవిదారణంబగుటనో సాహసంబింద్రజోత్సాహమయ్యె
వరవర్ణినీమనోహరవృత్తియౌటనో సోయగంబు సుమాస్త్రచాయ యయ్యె
తే. నౌర పరిపంథిరాజగర్వాంధకార, నలినహితుఁడైన తిమ్మభూనాయకునకు

ననుచుఁ బొగడుదు రఖిలనృపామృతాంశు, లహరహంబును ముదితాత్ములగుచుఁ జెలఁగి.

క. రామునకు లక్ష్మణుఁడు సు, త్రామునకుఁ ద్రివిక్రమాభిధానుం డెట్లా
రామాధిపునకుఁ దిమ్మధ, రామండలపతి మహానురక్తిగ మెలఁగున్. 382

సీ. కరుణారసార్ద్రీతసరినచ్చునొక్కింత పదినూఱుచేతులఁ బరఁగువాఁడు
వైభవంబునఁ బ్రతివచ్చునుబరికింపనొకసహస్రముకన్నులొనరువాఁడు
క్ష్మాభారభరణదక్షత నెనయఁగఁ జూడ దశశతాననములఁ దనరువాఁడు
పరమతేజంబునఁ బాటియౌ నెన్నంగ వేయికరంబుల వెలయువాఁడు
తే. గాక యితరుల నెటు దీటుగా నుతింప, వచ్చు మనుమార్గచరితుఁ డవార్యబాహు[సు.
శౌర్యుఁ డంభోధిగాంభీర్యుఁ డార్యవినుతుఁ, డయిన యార్వీటితిమ్మభూపాధ్యునకు

చ. పొడఁగననర్థికర్థమిడి పోయెదమూరికినంచుఁ దెల్పని
ప్పుడెకదయిచ్చినాపునక భూరికృపామతి వస్తువాహనా
లుడుగరలిచ్చియన్నుసుగుణోజ్జ్వలుఁ డార్వీటితిమ్మలేంద్రుఁ డీ
నడవడిగల్గునే శిబినృనాథదధీచులకున్ నిమ్మహిన్. 384

## ప్రహరణకలితవృత్తము.

చటులభుజబలశ్వసనజుఁడగు నా, ర్వీటితిరుమలభూవిభుపటహము ది
క్తటములవియనుద్ధతిచనఁ దనయం, తట భయపడి శాత్రవులిడుదురరిన్. 385

## ఫలసదనవృత్తము.

నిటలతటమున బొమలు నిచి కలనియందా, ర్వీటితిరుమలనృపశశి వితతకరహేతి
స్ఫుటతఁ బఱపన రితతి పొలఁతులెడలంతం, తట వనములకుఁ జనిరదడఁ బడుచు భీతిన్,

## కుసుమితలతావేల్లితవృత్తము.

క్రోపై ఖడ్గాళిద్యుతితతి మిణుంగుర్లుగాఁ గానిపించున్
గోపోద్రేకప్రాకటమదరిపుక్షోణిపాలాంబురుట్చ్ఛ
భాపాళుల్వాడఁగ నలుదెసలంబర్వి యార్వీటితిమ్మ
క్ష్మాపాలాంభోజహితుబలపరాగంబు ధ్వాంతంబుఁ జేయున్. 387

సీ. పలుమాఱు వైరిభూపాలురరాజ్యసప్తాంగముల్గట్టిల్కనాక్రమించు
జగజెట్టివలెఁ జేరి జలకట్టిగతిఁ దూఱి చలపట్టి బుసకొట్టి చప్పరించుఁ
బుడమిదాలుపు వేయిపడగలల్లాడంగ వడి మెట్టుఁ గిలకొట్టు బడలుపడఁగఁ
గడుమోరతోఁ బునూఁకుడుఁ జేసి కోలాడి కొమ్ములసగఁ దట్టుఁ జిమ్మిచిమ్మి

తే. కలఁచి కబళించి కడువడి బలిమి మించి, గెలిచియార్వీటి వేంకటక్షితిపతిర్మ
లేంద్రుఁ డిలమూఁపునను నిల్చియిరవుకొనియె, రాజనుతులొప్ప ఘనశేషరాహమూర్తి.

మ. అనిలో నార్వటితిర్మలాధిపుమహోగ్రాసిన్ రిపుల్ మ్రగ్గి పా
వనలీలన్ రవి దాఁటి దేవగణికావాటిం జరించిం దుదిప
జ్జను గూర్చుండిన మోవిగంటిఁ గని లజ్జన్ రంభ కన్వాల్చె నా
ననము న్వంచె ఘృతాచి పూనిరి సునందా మేనకల్ మౌనమున్. 389

శా. భీతిన్ జన్యపరాఙ్ముఖాహితవరుల్ భీమాటవీవాసులై
శీతోష్ణాదులకోర్చి యోగనిరతిన్ శ్రీరామనీలాహరుల్లై
చేతోజారి భజించుచుం జటిలురై చిత్రంబు సంరక్ష సం
ప్రీతిం గాంతురు రాయలాధిపుని మా శ్రీతిర్మలాధీశు చేన్. 390

తే. చేఁదు దిగ మ్రింగి సెలఁదులఁ జేర్చనట్టి, సాదుని వలె నాశ్రితావగుణాళి నణఁచి
గుణ మొకింతయుఁ గలిగినఁ గాని గ్రహించు, రాయలాధిపుతిరుమలరాయశౌరి. 391

సీ. పరకాంతఁ గన్నెత్తి భావించి చూడఁడు పరధనంబుఁ దృణంబుపగిదిఁ జూచుఁ
బరులదూషింపఁ జెప్పటికిని గల్గిన బొంకు నాలికయందుఁ బొసఁగనీఁడు
న్యాయమార్గ మొకింత పాయ వర్తిల్లఁడు ధర్మ మున్నవలనైనఁ దప్పఁబోఁడు
చాడిఁ జెప్పిన విననోడు సెన్నఁటికి నొకింతైనఁ గోపంబు పొంతఁ జనఁడు
తే. విడువఁ డాశ్రితరక్షయే వేళనైన, ధరణినన్యనృగాదిభూపతులఁ బోలి
మేలిగోనములవేలిమి మెలఁగ మరగి, భానునిభుఁడైన తిరుమలపార్థివుండు. 392

చ. సరసకళాప్రవీణుఁ డతిసాహసుఁ డంచితధర్మవేది భూ
సురవరపోషి దాని రిపుసూదనుఁ డద్వయతానువర్తియా
శ్వరభజనాతిసక్తమతి సాధుజనాదరణుండటంచును
ర్వర నుతిఁ దిర్మలక్షితిపవారిజమిత్రుఁడు గాంచె నంతయున్. 393

సీ. కట్టించె నేరాజు గగనంబు నొరయ విరూపాక్షప్రాగ్ద్వారగోపురంబుఁ
బెట్టించె నెన్నఁడభిధరపాణి హృద్దిష్టమృష్టాన్నసత్రంబు నిత్యఁ గూర్చి
చేయించె నేపుణ్యశీలుండు ద్విజులకు నడుగులు పండంగ్లా కటు మోదమునఁ
గావించె నేమహీకాంతుఁడు ముద్రించి సద్దు సంపాదనకై సమస్య [illegible]
తే. దలఁచు నేధన్యుఁ డాత్మ నుదనకుఁ గలుగు, మానితైశ్వర్యమీశ్వరధ్యానమనుచు
నతఁడు మనుజేంద్రమాత్రుఁడె యధిమహిమ, రాయలాధిపుతిరుమలరాయమౌళి.

ఆ. ఆటవీటితిరుమలాధీశ్వరుఁడు లావు, భద్రకరిఘనుఁడు వదనొసర్చ

పరమభక్తిని నాప్రబంధంబు శ్రీవిరూపాక్షు పేరఁ జేసె నంకితముగ. 395

సీ. శ్రీరంగనాథుఁగ వేరజాతటమున మును ధర్మవర్మప్రార్థన నొనర్చి
నిలిపిన వైఖరిని మహీధరశ్రేష్ఠమైన కిష్కింధాభిధానదివ్య
నగభేదిరై రమానాయకదేహశ్రమాంబుస్వరూపంబు నన ఘుమూర్తి
యగు తుంగభద్రామహానది మధ్యమ శ్రీరంగమందిరక్షేత్రమునను
తే. క్రముకముఖభూజముల మల్లికాప్రసూతిల, తాళిఁగలవనమును వేసి యాయుపవన
సీమయందును శ్రీరంగధామును నిచె, రాయలోర్వీశు తిరుమలరాయవిభుఁడు. 396

తే. చెఱువు నల్లిండ్లు వనము నిక్షేపదేవ, భవనసత్కృతిసుతులనఁ బరఁగు సప్త
సంతతులఁ గాంచె వరుసను సజ్జనములు, పొగడ నార్వీటి తిరుమలభూభుజుండు.

చ. అరుదగు లీలఁ దిర్మలనృపాధిపుసద్గుణశీలధారుణీ
ధరమునఁ బుట్టి సర్వవిబుధప్రణుతుల్ సెలఁగంగ దేవతా
నరఫణిలోకముల్ గెలయ నవ్యరతిన్ విహరించి రాజశే
ఖరశిరమావహించుటను గాంచెను గీర్తి సురస్రవంతియుఁ బోలెన్. 398

సీ. గంధసింధురజవసైంధవవీరగణంబులు బుత్విగ్జనంబు గాఁగ
దిగ్గజకర్ణబాధీకరసుభటాట్టహాసము ల్వేదమంత్రాళి గాఁగ
దళితాహితాశ్వమత్తగజఘటాలంకృతధరాతలంబు వితర్ది గాఁగఁ
జంపితరాట్కోపమండితపరిపంథిరాజవరులు పశుప్రతతి గాఁగ
తే. భూతభేతాళదేవతాప్రీతి గాఁగఁ, జటులసంగరసవనప్రజంబొనర్చి
వినుతికెక్కెను ధరను నార్వీటితిరుమల, భూమిపాలుప్రతాపాగ్నిసోమయాజి. 399

తే. పటుయశోనిధి చిన్నవేంకటపతీంద్ర, వీరవేంకటపతిరాయవిభులు తిరుమల
నృపతి జిల్లేళ్ళకొండమహీవరాఢ్యు, తనయరైన నట్టి కోనేటమ్మను వరించె. 400

క. అనసూయతౌర్యతాశుచు, లనసూయారోచిసుధాంశునబ్జముఖుల దీ
టన నారవీటి తిరుమల, ఘనుకోనేటమ్మ వినుతిఁ గాంచె ధరిత్రిన్. 401

సీ. సన్నుతికెక్కిన సతతాన్నదానంబు భోఁడిమి నాయన్నపూర్ణ సాటి
గణుతింపఁదగిన నట్టికడుఁ దాల్మి గొనఁగున జలరాశిమేఖలాలలన సాటి
సంస్తుతింపఁగఁదగు సర్వలక్షణములఁ బాలేటిదొర ముద్దుపట్టి సాటి
వినుతికిఁ జాలిన విమలమాంగల్యతఁ జలిమలఁ బొడమిన చెలువ సాటి
తే. గాక యితరము సేనాథకామినులను, సాటి యనవచ్చు నెట్టులార్వీటితిరుమ
లక్షితీశ్వరునర్థాంగలక్ష్మి యనఁగఁ, బరఁగు కోనేటమ్మను బుధవరులు సకల. 402

సీ. దుర్జయరాజన్యదోశ్శక్తులుడిగించి సర్వసర్వంసహాచక్రభార
భరణదక్షత మహాప్రౌఢులౌ శ్రీకృష్ణరాయలు నార్వీటిరామరాజ
తిరుమలరాయాదిధరణినాయకులును వారలదేవులు వసుధఁగీర్తిఁ
గనరె యాకీర్తికి జననంబు ఘోషితకవిజనసన్నుతిగాదె యట్టి
తే. కవిజనాధారవిఖ్యాతిఁ గాంచి మిగులఁ, గవులఁ బోషించి తన్నుతి కబ్బముల ను
తింపవెలసెను నార్వీటితిరుమలక్షు, మాపచంద్రు కోనేటమ్మ మహిని మిగుల. 403
శా. దీనత్రాణుఁడు తిమ్మరాజమహిభృద్దేవేంద్రుఁ డుద్యద్భుజా
నూనస్ఫారబలాహతాహితమహీశోత్సాహుఁడౌ పోచిరా
డ్భూనాథోత్తమరామరాజతనయన్ బూతాత్మఁ దిర్వంగళాం
బానారీమణి నగ్నిసాక్షిగను జేపట్టెం బ్రహృష్టాత్ముఁడై. 404
క. ఆమదిరాక్షులు తిమ్మ, క్ష్మామండలపతియు మనిరి సౌఖ్యోన్నతులన్
శ్రీమేదినులును హరిబలెఁ, బ్రేమలు చిత్తముల మిగులఁ బెనఁగొని నిగుడన్. 405
మ. అమరాహార్యసమానధైర్యుఁ డరివర్యధ్వంసి సద్వైభవా
నిమిషేంద్రుండగు తిమ్మరాజమణి కోనేటమ్మ శ్రీరంగభూ
రమణున్ శ్రీచినవేంకటక్షితిపునిన్ రాజద్గుణాంభోనిధిం
బ్రమదంబొప్పఁగఁ గాంచి రంతయు బుధవ్రాతంబు గీర్తింపఁగన్. 406
చ. ఎలమినిఁ దిమ్మరాయవసుధేశుసిరంగనృపాలవర్యుఁడు
జ్జ్వలవిజయాతిశౌర్యవరవైభవవర్ణితరూపచండదో
ర్బలమహనీయదానగుణరాజితకాంతులఁ గేలిసేయు నా
బలరిపుపుత్రసింహసురపాలరతీశబలాబ్ధచంద్రులన్. 407
క. కురుకులమణియగు శ్రీరం, గరమావరయశము దీటుగాఁ బూననుదా
సరిగాక డాఁగె శారద, సరసిజభవవదనజలజసదనము లందున్. 408
సీ. పరమవైభవమునఁ బ్రతివచ్చునొక్కింత చుక్క పేరిటి నాఁటిసుతునితాత
విక్రమోదగ్రత వినుతింప సరివచ్చుఁ జుక్క పేరిటి నాఁటిసుతునితాత
గాంభీర్యగుణమున గణుతింప సరివచ్చుఁ జుక్క పేరిటి నాఁటిసుతునితాత
యధికబలంబున నరయనుద్దనవచ్చుఁ జుక్క పేరిటి నాఁటిసుతునితాత
తే. కాకయితరులెటు దీటుగా నుతింప, వచ్చు నార్వీటిపురవంశవర్ధనుండు
విమతగజసింహుఁడగు తిమ్మవిభుతనూజ, చిన్నవేంకటపతిరాయశీతఘృణికి. 409
మ. అనిఁ దిమ్మాధిపు చిన్నవేంకటనృపాగ్ర్యత్ముండు గీర్వాణరా
ట్తనయుండంచును మార్కొనన్ వెలిచి యాత్తత్రాణపారీణుఁడై

ఘను సేవించుట యుక్తమంచు రిపుభూకాంతుల్ మదేభాశ్వమం
డనముల్ దెచ్చియొసంగి పెట్టుదురు దండంబుల్ వినీతాత్ములై. 410

మ. ఇలఁ దిమ్మప్రభుచిన్నవేంకటధరిత్రీశోరుసత్కీర్తినిన్
గలధౌతాద్రిని నాగిరీంద్రమున నుత్కుంభాబ్ధిపాథీశుపైఁ
జెలువొందన్ శివు నాగిరీశుతలపై శీతాంశునిన్ గంగనున్
దులలో నిట్లు జూఁడుంచి తూఁచ ములుదాఁ దోచున్ యశంబున్నెడన్. 411

తే. ఇట్లు సుతయుక్తమిల నుతికెక్కియునుఁగుఁ, దమ్ముఁడౌ తిమ్మభూభర్త నెమ్మిఁ గొలువ
రాజకులమణి కోదండరామవిభుఁడు, దనరుఁ గర్ణాటరాజ్యపదస్థుఁడగుచు. 412

క. ప్రణుతపరాక్రమతిగ్మకి, రణుఁ డార్యనుతుండు సకలరాజమకుటస
న్మణిరంగదంఘ్రిభాసుర, గుణియా రామవిభుఁ బొగడ గురునకు వశమే. 413

క. వనజాహితకులుఁడగు శ్రీ, చినవేంకటపతినృపాలశేఖరునకుఁ దా
మునుగరుణ వచ్చి వచియిం, చినయట్టివరంబొసంగుచిత్తముతోడన్. 414

సీ. జగములు గంపింప సాహసవృత్తిని వనితకై ధర్మవిధ్వంసియగుట
పట్టాభిషేకవిఫలత నొందియు జటివేషియై వనముప్రవేశమగుట
యపరాధియగువాని ననిలోనఁ ద్రుంపలేకర్కతనూజుతోఁ బాసపడుట
చెలరేఁగి మదిని వచింపక మిగులఁ బుణ్యజనౌఘవంశసంహారియగుట

తే. పరిహారముగాఁగ ధర్మతత్పరత రాజ్య, మేలి యసహాయశూరత నెసఁగి పుణ్య
జనుల రక్షింపఁ గోరి దాశరథి వేంక, టాధిపేంద్రుని రామరాజై జనించె. 415

సీ. ఎంతఁ జల్పిన మనవంతఁ జేయుటె కాని యంత లేదనుట యూవంత లేదు
సజ్జనసాంగత్యసరణి నుండుటె కాని యితరమార్గమొకింత లేదు
ప్రాకటసుకృతసంగ్రహబుద్ధియే కాని నీతిదూరంబైనరీతి లేదు
పరధనంబు తృణంబుపగిదిఁ గాంచుటె కాని మోమెత్తి చూచుట మొదలె లేదు

తే. దుష్టనిగ్రహమొనరింపఁ దొడరుఁ గాని, పరుల గుణదోషమెన్నుటవలను లేదు
రాముఁ బోలినసుగుణాభిరాముఁడైన, వేంకటపతీంద్రుని రామభూవిభునికరయ. 416

సీ. అలసటచేనైన ననృతమౌ మాటాడఁ డాడినమాట శిలాక్షరంబు
మఱచియైనను నసన్మార్గవర్తన లేదు వర్తిల్లు ధర్మప్రవర్తనంబు
కలనైన నోరులను నలుకతోఁ జూడఁడు చూచిన సంతతశుభకరంబు
నలయికలోనైన నర్థికీయఁడు కొంచెమిచ్చిన దారిద్ర్యమెల్లఁ దొలఁగు

తే. నెప్పటికినైనఁ బ్రజలకత్యంతయంత, సంతసమె కాని వేరగుచందమొందఁ

వనుచు ధరణభినుతిఁగాంచియలరునాఁగ, వీటివేంకటపతిరామవిభుఁడు మిగుల. 417

సీ. సదయప్రవర్తన శౌరిదాఁ బ్రతివచ్చు నరసారథియనంగఁ బరఁగఁడేని
ఘనగుణస్ఫూర్తి సాగరుఁడుదానైనయగు విషధినామంబున వెలయఁడేని
కాంతిని రోహిణీకాంతుండు సరిఁబోలు దోషాకరాఖ్యతోఁ దొడరఁడేని
సర్వజ్ఞతను ద్రిలోచనుఁడు చూడఁగనొప్పుఁ దామసగుణముఁ దాఁ దాల్పఁడేని
తే. యితనికనుచును బుధతతుల్ నుతియొనర్పఁ, దనరు నెంతయు లోకైకఘనుఁడఖిల
వసుమతీభారభరణనిర్వాహకుండు, వేంకటపతీంద్రుశ్రీరామపృథ్వీవరుండు. 418

మ. వనజాదిప్రసవాశుగంబులు శుకాశ్వంబిక్షుచాపంబు మీ
ననవోదగ్రపతాక దాఁచి ధరసున్ రాఁబోవు లక్ష్మీసుతుం
డని భావింతురు నెమ్మనమ్ములను మోదాభ్రాంతిచే భామినుల్
ఘను రామక్షితిపాధ్యు నార్తజనరక్షాదక్షు నెల్లప్పుడున్. 419

లయగ్రాహి.

దిక్కుల జయించుమది నెక్కుడుగ రామపతి పెక్కుగుబలంబులిగుచక్కఁ గొలువంగా
నొక్కపయనంబుననికక్కడికి రాఁదలఁచునిక్కమిది నాస్తతని యక్కడగుసూగుం
డొక్కరుఁడు గల్గుఁడిబనెక్కుడివిచారములు మ్రొక్కి కొలువన్ వలెను స్రుక్కి పనసీమన్
ద్రొక్కవలెఁ గాలగతులక్కరణి వచ్చు హరి దిక్కనుచు వీరములు దక్కుగురునైగుల్.

సీ. ఘనఘనాఘనసముత్కరపటితాశని ఘోషఘోర రవముల బెట్టు గెలిచి
ప్రళయకాలోగ్రభైరవకరఘంటికాఘణఘణధ్వనులనుగడు హసించి
పృథుతన్పహర్మ్యత్రువిభిన్నోన్నతస్తంభపటపటార్భటులను బరిహసించి
ఘోరహేమాత్రువిదారణోద్ధతకిటిఘుటుఘుటుస్వనములఁ గొంచెపఱచి
తే. ధరను వెలసెను రిపునృపధవసధూని, కాయములగర్భనిర్భేదక్రమవిహారి
గౌరవం బార్యలెంచంగఁ గాంచి రామ, ధారుణీనాథుభూరిభేరీరవంబు. 421

చ. పరధరణీశరాజ్యముల బల్విడి రామనృపాలుసేన స
త్వరముననాక్రమింపఁ జనఁ దత్పదరేణువు దిక్కులందునం
బరమున నిండఁ బొల్పెసఁగె భాస్కరుఁడుం బసలింటిదీపమై
యరయఁగ ధూళిధూసరితమయ్యె నభశ్చరసంతతాగ్రసుల్. 422

శా. ఉత్సారోహణుఁడై దిగంబరుఁడునై యుగ్రాంశుఁడై సొంపుగా
శిక్షేత్రంబునఁబోవువాఁడు చలులాబిక్ రామభూపాలకా
ధ్యక్షున్ మార్కొని తత్కరాసినిహతుండైనట్టివాఁడాసహ

గరిమచేఁ గరులను హయంబులం బదాతులం బోరిఁ గొని జయలక్ష్మిఁ బొందెనట్టు
లాసనమును పేరనమరిన పురియొద్ద మైసూరివారలు మాఱుకొనను
గణుతికి నెక్కినగంధసింధురతురంగమవీరభటనికాయములు పెక్కు
గలదళముల వారిదళవాయి యైనకుమారయ్య చనుదెంచి పోరుఁ దీర్పఁ
గని కరిఘటఁ గన్నకంఠీరవేంద్రునికైవడి మిగుల దుర్గర్వమెసఁగ
మేటైన కాసరకోటతిమ్మయ సబినీసుకృష్ణయ కార్యనిపుణుఁ డైన
మట్టి వేంకటపతిత్మాపాలుఁ డాదిగాఁ గలదొరల్ చతురంగబలముతోడ
నిరుగడ వెనుక ముందఱఁ ద్రొక్కి నడవంగ ధరణీవరాహపతాక మెఱయ
బలరజంబంబుదపథసురకామినీబృందధమ్మిల్లంబులందు నిండఁ
బలుమాఱు దెచ్చుచుఁ గలహాశనుఁడు నాట్యమెలమితో నాడుచు నిట్టిరణముఁ
గాననేరము మును గౌరవపాండవుల్ పెనఁగిరీరీతిని వినుతిచేయ
ఖడ్గమరీచులాకసము దిక్కులఁ గప్ప సుతహితబంధుసంతతులతోడఁ
గరులకుఁ గరులును హయులకు హయులును గాల్బలంబునకును గాల్బలంబు
దలపడి పోర శాత్రవసేనలు రుపడించినప్పుడుగని నిజసేనఁ జెదర
నియ్యక పురికొల్పి వ్రయ్యలుగా నని మొనఁ జొచ్చి చించుచు మూలలుగను
జోరఁ బోరి మతియును జుట్టువారక విన్వేసుఘుఁ బూనిన శౌరియూపుమాడ్కి
నరులకందఱకును నన్నిరూపంబులనక్కడక్కడ మొనకాని నిలిచి
హాలిపోలిక లయకాలునికైవడి మారిమసఁగునీతి మాఱులేక
రెంపవపాత్థుఁ డ్డీతంపననవలీలఁ గంముక క్రీడగాఁ గంధరములు
ధర డొల్లఁ బదములు కరయుగంబును బ్రక్కడొక్కనియే ఱుపఱు కరూక
వండెమదఱిగినట్లుండ గాత్రంబు ఖండమ్ముల్ కుప్పలుగాఁ గూర్పు
విదళితద్విపమును వినిహతహయమును నిపాతితవీరపదాతియును వి
ఖండితవాహవేదండచయారోహకంధరంబును వికలితపాద
కర్ణనాసోష్ఠకంఠకరంబు విభ్రష్టకేయూరహారమును భూరి
ఘోషంబు విశ్రుతసింహనాదంబును విదార్యమాణగదాసితోమరగదాంగ
పరశుపట్టసశూలపరిఘంబు వినిపాతితచామరకేతనచ్ఛత్రమును వి
ధీయమానతురగాళిఖురసముద్ధూతవిపులపాంసుగంబు విరహితాన
కారావకరటిఘీంకారఘంటాఘణంఘణత్కారభూషణఝణఝణత్కారతురగ
కింకిణీనూపురక్రేంకారవీరభటాన్యోన్యధిక్కారమాజిభూమి
యగునట్లుగాను మహోగ్రప్రవాహముల్ గాత్రయుతంబుగాఁ జాఁగి పాఱ
శాకినీప్రముఖపిశాచజంబుకకంకవారంబులకుఁ దనివారఁ బెద్ద

పబ్బంబుగా వీరభటసామజాశ్వాళిఁ బొరిఁగొని హరులనుగరులఁ బట్టి
శరణన్న నృపతులఁ గరుణతోఁ గాచుచుఁ బఱవడిఁ గొండజూఁ బట్టి విడిచి
కాందిశీకత నలుగడలకుఁ బాఱిన వెంటనంటక మళ్లివిడుపట్టుఁ
జూఱగాఁగొని జయభేరులు మ్రోయంగ సైన్యంబులుభయపార్శ్వములఁ గొలువ
నిజశిబిరంబున నిండువేడుకఁ దలప్రాపు వాడక సుఖంబున వసించి
క్షితిసురౌఘమ్ములాశీర్వాద మొనరింపఁ బ్రమదలు నీరాజనములొసంగ
రామ రాజకులాబ్ధిరాకాసుధాకర రాజాధిరాజ వీరప్రతాప
రాజమార్తాండ సుత్రామసన్నిభ యష్టదిగ్రాజభయదార్క తేజ రాజ
పరమేశ యనుచును భటకవిగాయకుల్ వినుతింప నసదృశవిజయమును

తే. బొందెఁగడు శ్రీవిరూపాక్షుభూరికరుణ, స్థిరముగా నెంతయును దనుఁ జేరినార
వీటిపురవంశమణియార్యవినుతచరితుఁ, డైనకోదండరామరాయనరవరుఁడు. 430

సీ. ఎల్లప్పుడును గనులెఱ్ఱగాఁ జేసుక పడి మోరతోఁ బునుగుడు లెగయును
గనుఁగొనుచూరక తనపఁ దానడఁకుచు బుడిబుడి కడుపులో ముడుచు మొగము
పదవృత్తి మేననుగదురఁ మాఁగుచు బయల్ సారెసారెకును జేబారలిడును
గాలానటించు నేవేళ నుజూచిన బుసకొట్టుచుంబంట విసపుఁ బెట్టు

తే. ననుచు భూదారపార్శ్వనాగాహివరుల, బరిహసించుచు ధారుణీసరసిజాక్షి
భామినీలోకనూతనపంచబాణు, రామరాజేందునిలమూఁపు రహిఁ వహించె. 431

సీ. ఘనమదోద్ధతప్రవృత్తి కరిశాబకములంద గతివిభ్రమము రథాంగములయంద
పరపీడనము వీరభటసంకులములంద త్వరితలాఘవము సైంధవములంద
ధర్మవిధ్వంసంబు దారుణాహవమంద ఖరకరత్వము సాయకములయంద
భీషణారావంబు భేరిభాంకృతులంద యతిచంచలత మండలాగ్రమంద

తే. కాని తనయందుఁ బ్రజయందుఁ గానఁబడక, యుండ నేలెను ధారుణీమండలంబు
శౌర్యమున నాదిరాజన్యచర్య మెఱసి, రాజకులభూషణుఁడు రామరాజవిభుఁడు.

మ. కుముదాప్తాన్వయభూషు రామవిభునింగొల్వంగ నశ్రాంతము
గములై వచ్చి నిజాంకమూర్ధపతాకల్ చాల శోభిల్లఁబా
ళెములం జొచ్చును డిగ్గి కాన్కలిడి పాళింబుల్ గలంజెయ్యరం
బ్రమదంబందఁగఁ జేయుచుండుదురు సర్వక్షోణిపాలాగ్రణుల్. 433

క. అనవరతకృతాధ్వరముల, ననిమిషులకు మిగుల మోదమలరించుచుఁ గాం
చెను భూజనులెంచఁగ వరుస, నను రామవిభుండు సప్తసంతానంబుల్. 434

క. క్షేమంబడిగిననర్థికి, నంతయు నదె రామనరవరాగ్రణి యొసఁగున్

సంతతవితరణరేఖా, చింతామణియనుచు బుధులు క్షితి నుతిచేయన్. 435

మ. అలరన్ రామవిభుండు శిక్షితముసై యార్యప్రజస్తుత్యమై
వెలయన్నేర్చినపూర్వధర్మవిలసద్విద్యావిశేషంబును
జ్జ్వలమైనట్టిగుణంబు నర్థిసలనున్ వ్యాకీర్ణమై మార్గణా
వళులెల్లప్పుడు సన్నిధిన్ మిగులనున్ వర్తిల్లఁ జిత్రంబుగన్. 436

మ. ఘనకర్ణాదులఁబోలు రామధరణీకాంతేశునౌదార్యమున్
గనియాతారసువర్ణభూధరములన్ గాపుంచిరీశేంద్రులున్
దనరన్నెప్పుడు దేవతల్విబుధవిత్తప్రేమలేదిమ్మహా
త్మునకిట్లున్నను వీనిసేఁడని సురస్తోమంబు మోదంబునన్. 437

మ. ననపాలాయిదియేమి కల్పకము లేవన్ భూమిపై రాల్చెఁ గ్రొ
న్ననలన్నన్ వినుమో శచీశ ధరణీనాథాద్యుఁడౌ రామభూ
జనిశంబర్థులకర్థినర్థమిడు మిత్రాత్మోద్భవున్ మీఱియం
చును జెప్పన్ దలయూఁచి మెచ్చుచునటంచున్ వల్లువ వాఁడంగన్ప్రీతితోన్. 438

చ. తిరముగ నీలికోఁకఁగట్టిఁదీర్పనిరాముఁడు కంసనీసునున్
గరళముతేనిశంకరుఁడు కంపదఁజెందనిశీతభానుఁడున్
సరియగుఁగాకయున్న సెటు సాటగునంచు జనంబులెంచఁగాఁ
బరఁగు ధరిత్రి రామనరపాలునికీర్తి మనోజ్ఞమూర్తియై. 439

సీ. ఘోరవిరోధిధరావరమణౌఘుచోర్గర్వంబు కాలంబుఁగడకు మాన్పి
దుష్టాహితేశవధూసంఘమానసేందీవరోల్లాసంబుఁ బోవఁద్రోచి
దర్పితాజేయశాత్రవబలయామినీరాజమండలముసంభ్రమముమాణించి
పరిపంథిమానవవరచారుసైన్యప్రాలేయపటలంబుఁ బాఱఁదోలి

తే. హితపయోరుహములకునింపెసఁగఁజేసి, ధీజనస్తుత్యసరఁగినదెసలు వెలుఁగ
ధరణిఁగోదండరామరాడ్ధరణిపాల, నయనిభూరిప్రతాపభాస్కరుఁడు వెలఁగు.

సీ. జిగివెండిసరిగంచుచెంగావిపట్టువని కొంత్కింతు గంతయుఁగట్టుకొనఁగ
శ్రీగంధమిళితకాశ్మీరపంకంబని తలపోయుదురు మీసనలఁదుకొనఁగ
జాజులజతయైనసంపంగిదండని మూఁపురు కొప్పునఁజుట్టుకొనఁగ
ఘనహారపద్మరాగయుతభూషణమని శ్రీలుఁబొందుగసుంకొత్తబెట్టుకొనఁగ

తే. భ్రమసి తిరుగుదురిట్టుల దిగ్భామలెప్పుడును జతుర్వ్యాప్తశృంగారమునుసుటించఁ
గిమంబుజాండంబునిండి చెల్వలరురామ, విభునికీర్తిప్రతాపములో వెలయుచుండు. 441

శా. కారుణ్యాంబుధి పోచిరాట్కులసుధాకంధీశుఁడర్థార్థి మం
దారుండై విలసిల్లుకృష్ణపనుజాధ్యక్షేందుసత్పుత్రి నాం
చారమ్మన్ పరియించె రామధరణీశస్వామి మోదంబునన్
క్షీరాంభోనిధికన్యనచ్యుతుఁడు మున్ జేపట్టినట్టుంబలెన్. 442

తే. రాజమణియౌజిలెల్లతిర్మాధరాజు, తనయ వెంకమదేవినుద్వాహమయ్యె
నారవిటిరామభూపాలకాగ్రగణ్యుఁ, డఖిలబాంధవనికరంబులభినుతింప. 443

ఉ. సూరపవంశవర్ధనుఁడు సూరిజనావనుఁడైనయోబధా
త్రీరమణీశునాత్మజ సుధీనుతనుగ్గమదేవినిన్ మహో
దారుఁడు రామరాజహిమధాముఁడు వేడ్కనుబెండ్లియయ్యె నా
గారిని మోదమొప్పఁ గరకంధరుఁడున్ వరియించుభంగిగన్. 444

మ. పరువంశాగ్రణిరాయలాధిపుని శ్రీకోదండరామాఖ్యభూ
వరుఁడంభోజహితాన్వయాబ్ధిశశి శశ్వత్కీర్తియౌ పోచిరా
డ్ధరణీపాలునియచ్చిరాజుతనయన్ ధన్యన్వినీలాలకన్
హరిణాంకాస్యను రంగమాంబను వివాహంబయ్యె మోదంబునన్. 445

ఉ. సంగరరంగభార్గవుఁడు సానుజనావనుఁడౌజిలెల్లతి
ర్వంగిశనాథరాట్సుతను విశ్రుతధర్మగుణాలవాల సా
రంగధరాస్యనుగ్గమను రామవిభుండు వివాహమయ్యెను
ప్పొంగుచు సర్వబంధుచయమున్ దగునౌనని సన్నుతింపఁగన్. 446

తే. వెండియునలజిల్లెళ్లతిర్వంగశేందు, తనయయైనట్టినాంచారమను వరించె
నారవీటికోదండరామావనీశుఁ, డఖిలబాంధవసందోహమభినుతింప. 447

సీ. కావేరికాల్వలు గాఁదీర్చి కట్టించి కట్టినాతనిపేరుఁగలిగి తనదు
కులమొప్పఁజేసినజలజాప్తవంశజుఁడగుచోళభూపాలునన్వయాబ్ధి
సోముఁడౌ వరదరాట్క్షోణీశునప్పలమానవాధీశుకుమారికఁదిరు
వెంగళాంబను నారవీటివంశలలాముఁడౌ రాయలాధీశునగ్రతనయుఁ
తే. డఖిలరాజన్యమస్తకన్యస్తమకుట, మాన్యమణిరాజపాదతామరసుఁడలఘు
చరితుఁడైనట్టిరామరాజ్జనవిభుండు, పరిణయంబయ్యె బాంధవప్రణుతులెసఁగ. 448

ఉ. భానుని నప్పుడింతయెడఁబాయనిఛాయయుఁబోలి రామభూ
జానిమనంబు రా మెలఁగి చాల సపర్యలొనర్చి మన్ననన్
మానుగఁగాంచి బాంధవసమాజముకొంగుపసింపసంగనా

మానవతీచయంబు గుణమండనసన్నుతిఁ గాంచె నెంతయున్. 449

చ. భరతకులప్రదీపుఁ డరిభంజనుఁ డంచితరాజధర్మత
త్పరమతి యారవీటిపురధాముఁడు రామమహీతలాధిపే
శ్వరుఁడు మదిన్ బ్రమోద మొదవన్ గనె నుగ్గమదేవియందు భా
సురసుకుమారునిన్ సుగుణశోభితు నింబెద వేంకటాధిపున్. 450

క. ఘనుఁ డగు రామనృపాలుఁడు, కనె నాంచారమ్మయందుఁ గడు మోదముతో
డను జినవేంకటపతినృప, వనజాహితు రాజవంశవర్ధను ననఘున్. 451

క. రెండియు నాంచారమ్మకు, పండితయశుఁ డైన రామమనుజేశునకా
ఖండలసన్నిభుఁ డగుకో, దండమహీపాలతుహినధాముఁడు పుట్టెన్. 452

మ. శమితారాతిబలుండు రామమనుజేశస్వామి రాజాస్యరా
గమదేవీమణివల్లిఁ గాంచెను మహాహ్లాదంబుతో ధన్యునిం
బ్రమదానూతనపంచబాణు సుగుణభ్రాజిష్ణుఁ బంచాస్యవి
క్రముఁ బాథోధిగభీరు వేంకటపతిక్ష్మాపాలకాగ్రేసరున్. 453

సీ. సంగీతసాహిత్యసరసవిద్యాప్రౌఢి రాజీవగర్భతనూజు భోజు
ఘనధర్మగుణగణకాంతి నిస్తంద్రత రాజాంతకుఁడైన రాము సోముఁ
జంపతరాటోపసౌందర్యవైఖరి క్ష్మాధరకన్యాకుమారు మారు
సకలభూభరణభుజాబలవిస్ఫూర్తిఁ బవనభుక్కులసార్వభౌము భీముఁ
తే. దెగడి ప్రహసించి యుతికించి ధిక్కరించి, మించి సరిఁబోలి ప్రతియయి మేటి యగుచుఁ
దనరుఁ గోదండరామభూధవుని పెద్ద, వేంకటోర్వీశ్వరుండు దార్యవినుతు లెసఁగ. 454

చ. బలిసదనంబుఁ బొందుకొని పన్నగభర్త నిడంగఁ జేసి భూ
తలము బలాక్రమించెను సుధాజలరాశి మథించి నాకమున్
గలయఁగఁ బర్వి కల్పకముఁ గైకొనె నిట్లు జగత్త్రయంబునన్
వెలసెను రామరాజుపెదవేంకటభూపతికీర్తి వేడుకన్. 455

తే. అప్పు డుర్విఁ గోదండరామావనీశు, పెద్దవేంకటనరపతి పెండ్లియయ్యె
నెలమిఁ బోచిరాట్చినవేంకటేశుపుత్రిఁ, గోనమాంబను బాంధవకోటి యలర 456

సీ. సతతంబు నతిభక్తిఁ బతిసేవ సేయుచు నతులితసంపద యతిశయిల్ల
నత్తమామలపట్ల ననురక్తి నడచుచుఁ దోడికోడండ్రతోఁ గూడి మెలఁగి
వదినెలు మఱఁదండ్రు ముదమందనల్లన మఱఁదులఁ దారతమ్యములఁ బ్రోచి
సుతులఁ బ్రీతినిఁ గాంచి హితబంధువులు దాసదాసీజనంబులు దయను మనిచి

తే. పుట్టినిల్లును మఱిదాను మెట్టినిల్లు, వన్నెవాసినిఁ జెలఁగంగ మన్ననఁగనె
నారవీటివేంకటపతిక్ష్మాధినాథు, కోనమాంబకు సాటి యేమానవతులు. 457

క. రతిమదనులన శచీంద్రుల, గతి సౌఖ్యములలర మనిరి కాకోదరరా
ణ్ణుతపెద్దవేంకటాద్రి, క్షితిపతి కోనాంబ విభుఁ కీర్తనలెసఁగన్. 458

సీ. హరిరాజహరిరాజహరిరాజులకు సాటి పటుబలాజ్ఞానూనభాషణముల
హరిహయహరిహయహరిహయులకు సరి వితతక్ష్మాభోగవిభవములను
హరిసుతహరిసుతహరిసుతులకు నెన వినుతజవౌదార్యవిక్రమముల
హరిపౌత్రహరిపౌత్రహరిపౌత్రులకుఁ బ్రతి సద్ధర్మవిజ్ఞానసాహసముల
తే. ననుచు నెవ్వాని వినుతింతు రఖిలవిబుధు, లగమహీధరశతకోటియారవీటి
వంశకలశాబ్ధిరాకాసుధాంశుఁ డతఁడు, పరఁగుఁ బెద వేంకటక్ష్మామాగ్రయోలమి. 459

ఉ. ఆలములోన రామమనుజాధిపు మా పెదవేంకటావనీ
పాలుఁడు శత్రులందునుమఁబల్వురఁ దదుధిరప్రవాహముల్
చాలఁగ వార్ధినించె నటు చాలునె భార్గవరాముసాహసా
భీలత యెంతదొడ్డ యని పేర్కొన నేనుమడుంగులే కదా. 460



చెన్నపురి : 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1923.

# ఆంధ్ర ప్రబంధములు.

| | | రూ. | అ. |
|---|---|---|---|
| | | ప్రతి 1-కి రూ. | అ. |
| ఆంధ్రభారతము, పద్యకావ్యము:— | | | |
| ఆది, సభాపర్వములుగల సంపుటము | ... | 2 | 4 |
| ఆరణ్యపర్వము ,, | ... | 2 | 4 |
| విరాటోద్యోగపర్వములు ,, | ... | 2 | 4 |
| భీష్మద్రోణపర్వములు ,, | ... | 2 | 4 |
| కర్ణశల్యసౌప్తిక స్త్రీపర్వములు | ... | 2 | 4 |
| శాంతిపర్వము ,, | ... | 2 | 4 |
| ఆనుశాసనిక అశ్వమేధ ఆశ్రమవాస మౌసల మహాప్రస్థానిక స్వర్గారోహణ పర్వములుగల సంపుటము | ... | 2 | 4 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము | ... | 6 | 8 |
| యుద్ధపంచకము ,, | ... | 4 | 4 |
| శాంతిసప్తకము ,, | ... | 4 | 4 |
| ఆంధ్రభారతవిమర్శనము పల్లాది సూర్యనారాయణశాస్త్రిగారిది | ... | 0 | 8 |
| శకుంతలాపరిణయము, కృష్ణకవికృతము | ... | 0 | 12 |
| తెనుఁగుసమస్యలు, చక్కనికూర్పు | ... | 0 | 2 |
| భాస్కరరామాయణము, చక్కనికూర్పు, అత్యుత్తమప్రతి | ... | 4 | 0 |
| కృష్ణరాయవిజయము, కుమార ధూర్జటికృతము | ... | 0 | 8 |
| లంకావిజయము (రావణదమ్మీయము), సటీక, పిండిప్రోలు లక్ష్మణకవికృతము | | 1 | 4 |
| నిర్వచనోత్తరరామాయణము, సాధారణప్రతి | ... | 0 | 12 |
| ఉత్తరరామాయణము, కంకంటి పాపరాజప్రణీతము, చక్కనికూర్పు | | 2 | 4 |
| రంగనాథరామాయణము, ద్విపద, చక్కని క్రొత్తకూర్పు | ... | 3 | 8 |
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు శ్రీమద్రామాయణమునకు సరియైన పద్యము, కవనము మిక్కిలిసొంపు, పీఠిక అతివిపులము | ... | 5 | 8 |
| మొల్లరామాయణము, చిన్నసైజున పెద్దఅక్షరములతో ముద్రితము | ... | 0 | 10 |
| అచ్చతెనుగురామాయణము, శుద్ధప్రతి | ... | 1 | 4 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకు ముద్రితమైన ప్రతులకన్న అన్నివిధముల బాగుగనున్నది | ... | 6 | 0 |
| డిటో అత్యుత్తమప్రతి, రెండుసంపుటములు | ... | 8 | 0 |
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు | ... | 0 | 10 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.

## ఆంధ్రగ్రంథములు.

| | ప్రతి 1-కి రూ॥ | అ. |
|---|---|---|
| భోజరాజీయము, అనంతామాత్యకృతము .... | 1 | 2 |
| తారాశశాంకవిజయము, చక్కనికూర్పు .... | 0 | 12 |
| బసవపురాణము, పిడుపర్తి. సోమనాథప్రణీతము .... | 2 | 4 |
| హంసవింశతి, నారాయణామాత్యప్రణీతము .... | 0 | 14 |
| చెన్నబసవపురాణము, పావకవికృతము .... | 1 | 2 |
| పంచతంత్రము, నారాయణకవికృతము .... | 0 | 12 |
| ఆంధ్రబ్రహ్మాండపురాణము .... | 5 | 0 |
| సీతారామాంజనేయసంవాదము, సటీక. అనేక నూతనాంశములు చేర్చి చిన్నసైజున ముద్రించినారము. టీక, వివరణము మిక్కిలివిపులము. ఇదివఱకు ప్రకటితమైనప్రతులకన్న బాగుగనున్నది. సాధారణప్రతి .... | 2 | 8 |
| జైమినిభారతము, అశ్వమేధపర్వము, చక్కనికూర్పు .... | 1 | 0 |
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రెగడ, క్రొత్తకూర్పు .... | 0 | 12 |
| వైశ్యపురాణము, పద్యకావ్యము .... | 1 | 4 |
| ఉత్తరహరివంశము, నాచన సోమనాథకృతము .... | 1 | 8 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, టీకానుక్రమణికాసహితము .... | 0 | 12 |
| అనంతునిఛందము, ఛందోదర్పణము .... | 0 | 14 |
| బిల్హణీయము, చక్కనికూర్పు .... | 0 | 8 |
| వైజయంతీవిలాసము ,, .... | 0 | 8 |
| రుక్మిణీపరిణయము, శుద్ధప్రతి .... | 0 | 8 |
| రసికజనమనోభిరామము .... | 0 | 12 |
| రాజశేఖరవిలాసము .... | 0 | 8 |
| వేమనపద్యములు, చక్కనికూర్పు .... | 0 | 6 |
| డిటో బ్రౌనుదొరగారి ఇంగ్లీషుతో .... | 1 | 4 |
| డిటో ([illegible]) ఆంధ్రతాత్పర్యముతో .... | 3 | 8 |
| బాలచంద్రోదయము .... | 0 | 8 |
| అప్పకవీయము .... | 2 | 8 |
| సులక్షణసారము, సటీక .... | 0 | 10 |
| ఆంధ్రభాషాభూషణము .... | 0 | 2 |

